జైహింద్.

# స్వాతంత్ర్య సమరము

(నాటకము)



ఆంధ్రరత్న గ్రంథమాల
తొలి పుష్పం
పేరాల.



గ్రంథకర్త:
అబ్బరాజు రఘురామారావు

# పరిచయం

ఈ నాటకం ది 26-1-40న ఇడుపులపాడుగ్రామము (గుంటూరు జిల్లా, బాపట్లతాలూకా) లో జరుపబడు 'స్వాతంత్ర్యదినోత్సవము' నకుగాను బాపట్లతాలూకా రైతుసంఘమువారి కోరికపైని మిత్రుడు శ్రీ పుల్లెల రత్తయ్యగారి ప్రోత్సాహముతో వ్రాయబడినది. ఆ గ్రామ 'యువజన నాటకసంఘము'వారు భారతజాతికి పవిత్రమైన స్వాతంత్ర్య దినోత్సవ పర్వదినమందు శ్రీ జనాబ్ గౌస్ బేగ్ సాహెబు (చీరాల) గారి అధ్యక్షతక్రింద జనరంజకముగా ఈ నాటకాన్ని ప్రదర్శించి ప్రజల మన్ననలందిరి. ఈ వార్త ది 30-1-40 వ తేదీగల 'ఆంధ్రపత్రిక' (మద్రాస్) లో ఆనాడే ప్రకటింపబడెను. భారతరాజకీయ ఆకాశమునందు యీ ఆరేండ్ల పైకాలమునుండి ప్రభుత్వ నిషేధమేఘములు దట్టముగా ఆవరించియున్న కారణాన యీనాటకాన్ని యింతవరకు ప్రచురించలేదు. నిషేధనీలమేఘములు పటాపంచలై కొద్దిరోజులైనది. కాని నాకు సహజంగానుండు ఆర్థికస్థాయియొక్క లోపమువలన దీనిని వెంటనే వెలుగులోకి తెచ్చుట ఆలస్యమైనది. నా మిత్రుడు శ్రీ చుండి రామమూర్తిగారు (దగ్గుబాడు) తన సహజ నాట్యకళాభిరుచిని, సారస్వతసేవను పురస్కరించుకొని నాకు ధనమిచ్చి నేడు చేయూత నిచ్చినారు. కాన, చరిత్రప్రసిద్ధుడు,కళావేత్త, భారతస్వాతంత్ర్యయోధుడు, చీరాల పేరాల సత్యాగ్రహ సమరనిర్మాత, అమరజీవి, ఆంధ్రుల హృదయంగమ ఉపన్యాసకుడగు కీ. శే. 'ఆంధ్రరత్న' శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారి స్మారకచిహ్నముగా యీ గ్రంథమాలి యిచ్చట స్థాపించి, అందు 'తొలిపువ్వు'గా యీ నాటకాన్ని నేడు ప్రచురించుచున్నాను.

ఈ నాటిక యితివృత్తము ఎచ్చటనో వెతకి వరికోరి తెచ్చుకొన్నది కాదు. నేను బుర్రబద్దలుకొట్టుకొని ఊహించి క్రిందుమీదుపడినది కాదు. పాతపురాణములను, శాస్త్రములను, చరిత్రలను త్రవ్వి తీసినది కాదు. ద్వితీయప్రపంచ మారణహోమము ప్రారంభమైన నాటినుండి నాలుగు నెలలవఱకు మాత్రమే నాభారతదేశముయొక్క రాచకీయపరిస్థితి యెట్లున్నదిన్నీ, సామ్రాజ్యతృష్ణగల బ్రిటిష్షు ప్రభుత్వము వారినుండి నా దేశీయులు దేశవిముక్తికై ఎట్లు పెనగులాడిన విషయమున్నూ, నా మాతృభూమినిగూర్చి పాలకుల ఆశయములు, విధానములున్నూ ఉన్నవి ఉన్నట్లుగా దినపత్రికలలో చదివినవి చదివినట్లుగా ప్రజానీకమునకు యీ నాటకరూపమున వివరించుకొంటిని. అవసరమైనచోట్ల కొద్దికొద్దిగా నా సొంతఊహాలుకూడా అసలువిషయమునకు ఆటంకము లేనంతవరకు చేర్చితిని. ఆంధ్రావనియందున్న కళాకోవిదులు, లలితకళాభిమానులు, రసపిపాసువులగు పాఠకలోకమున్నూ నాటకనిర్మాణ కృషియందు నా 'తొలిరచన' యగు యీ జాతీయనాటకమును ఆదరింతురుగాక యని మనవి. ప్రమాదో ధీమతామపి. జై హింద్.

పే రా ల }
9-9-45 }

ర చ యి త



# అంక విభజన - విషయ వివరణ.

## —♦ 1 వ అంకం ♦—

1 వ రంగం—గాంధి - పటేలు - నెహ్రూ - బోసు - రాజేంద్రప్రసాదు గార్ల సమావేశం ½ గంట మాత్రము. భారతస్వాతంత్ర్య సమరములలో ప్రాణాలనుఅర్పించిన వీరులనుస్మరించుట,సూత్న శాంతి, సమర ప్రారంభచర్చ, బోసు కుపితుడై వెళ్లుట మున్నగునవి.

2వ రంగం—రైతుల సమావేశం 15 నిమిషాలుమాత్రం.

## —♦ 2 వ అంకం ♦—

1వ రంగం—ఇండియా వైస్రాయి - కార్యనిర్వాహక సభ్యులు - వీరి సమావేశం 15 నిమిషాలు. ద్వితీయప్రపంచ మహాసంగ్రామము గూర్చి, ఇండియా సైన్యాలను విదేశాలకు బ్రిటిషు ప్రభుత్వంవారి ఉత్తర్వు ప్రకారం పంపుట మున్నగు విషయాలగూర్చి.

2వ రంగం—గాంధి - పటేలు - అజాద్ - సరోజిని - రాజేంద్రప్రసాద్ బోసు - నెహ్రూగార్లతో కూడిన కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశం 20 నిమిషాలు. ఇండియాను యుద్ధములో చేరిన దేశముగా బ్రిటిషువారు ప్రకటించుటగూర్చి చర్చ. బోసుగారి అసంతృప్తి మున్నగునవి.

## —♦ 3 వ అంకం ♦—

1వ రంగం—ఇంగ్లండు - హేలిఫాక్సు - క్రిప్సుగార్లు లండనులో సమావేశం 20 నిమిషాలు. భారతజాతీయ కాంగ్రెసు వర్కింగుకమిటీవారి తీర్మానమునుగూర్చి చర్చ. శ్వేతపత్ర ప్రకటనగూర్చి ఇండియా వైస్రాయికి ఇంగ్లండు ఉత్తరువు మున్నగునవి.

2వ రంగం—వైస్రాయి - గాంధి - జిన్నా - నెహ్రూ - రాజేంద్రుడు ఏకేలుగార్ల సమావేశం ½ గంట. రాజీసంభావణలున్నగునవి

—♦ 4వ అంకం ♦—

1వ రంగం—గాంధి - పటేలు - నెహ్రూ - రాజేంద్రప్రసాద్ - బోసు అజాద్ - గార్లతో కూడిన కాంగ్రెసువర్కింగుకమిటీ సమావేశం 15 నిమిషాలు. కాంగ్రెసునాయకులు శ్వేతపత్రమును విమర్శించుట, బ్రిటిషువారి యుద్ధాశయములగూర్చి చర్చ, ప్రజాపరిషత్తును కోరుట, శాంతిసమరసన్నాహములగూర్చి తీర్మానము, రాష్ట్రాలలోవున్న కాంగ్రెసుమంత్రులను రాజీనామాలు పెట్టమని అజ్ఞాపించుట మున్నగునవి.

2వ రంగం—మద్రాసుగవర్నరు - రాజాజీ - ప్రకాశంగార్ల సమావేశం 10 నిముషాలు. మద్రాసుమంత్రులు రాజీనామాలు దాఖలు చేయుట.

—♦ 5వ అంకం ♦—

1వ రంగం—అజాద్ - జిన్నా - నెహ్రూగార్ల సమావేశం 10 నిమిషాలు. కాంగ్రెసు, లీగుసంస్థల ఐకమత్యమునుగూర్చి చర్చ మున్నగునవి.

2వ రంగం—గాంధి - పటేలు - నెహ్రూ - అజాద్ - సరోజిని - రాజేంద్రప్రసాద్‌గార్లతో కూడిన కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీ సమావేశం ½ గంట. స్వాతంత్ర్య ప్రతిజ్ఞ, త్రివర్ణపతాక వందనములు, 'ప్రజాప్రబోధకర పత్రిక', నాయకులు దీక్షాకంకణములు కట్టుకొనుట, స్వాతంత్ర్యసమర సన్నాహములు మున్నగునవి.

(సమాప్తి.)



# అంకితము

1857 లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్య సమరములో
పాల్గొని వీరస్వర్గము చూరగొన్న
పూజ్య శ్రీయుతులు
బహదూర్ షా, నానా సాహెబ్,
ఝాన్సీలక్ష్మి, మంగళపాండ్య
మున్నగు స్వాతంత్ర్యయోధుల
పాదపద్మములకు

—రచయిత.



# పాత్రలు

మగవారు:

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీయుత | గాంధీజీ | — భారతదేశభాగ్యవిధాత. |
| 2 | ,, | పటేలు | — కాంగ్రెసుపార్లమెంటరీబోర్డు అధ్యక్షుడు |
| 3 | ,, | నెహ్రూ | — కాంగ్రెస్ యుద్ధోపసంఘ అధ్యక్షుడు |
| 4 | ,, | బోసు | — "ఫార్వర్డుబ్లాక్" పార్టీ అధ్యక్షుడు |
| 5 | ,, | అజాద్ | — కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీ సభ్యుడు |
| 6 | ,, | రాజేంద్రుడు | — భారత జాతీయమహాసభ అధ్యక్షుడు |
| 7 | ,, | జిన్నా | — భారత ముస్లింలీగు అధ్యక్షుడు |
| 8 | ,, | జట్లండ్ | — ఇండియా మంత్రి |
| 9 | ,, | హోర్ | — బ్రిటిష్ పార్లమెంటు కన్సర్వేటివ్ పక్ష సభ్యుడు |
| 10 | ,, | క్రిప్స్ | — బ్రిటిష్ కార్మికపక్ష మెంబరు |
| 11 | ,, | లిన్‌లిత్‌గో | — ఇండియా వైస్రాయి |
| 12 | ,, | ఎర్స్కిన్ | — మద్రాసురాష్ట్ర గవర్నరు |
| 13 | ,, | రాజాజీ | — మద్రాసు ప్రధానమంత్రి |
| 14 | ,, | ప్రకాశంగారు | — మద్రాసురాష్ట్ర రెవిన్యూమంత్రి |

ఆడవారు.

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీమతి | సరోజినీదేవి | — కాంగ్రెస్ వర్కింగుకమిటీ మెంబరు |

సందర్భానుసారముగా ఇంకా కొందరు వచ్చెదరు.



జైహింద్

# స్వాతంత్ర్య సమరము

## మొదటి అంకము

### 1వ రంగము

స్థలం—సేవాగ్రామంలో మహాత్ముని కుటీరప్రాంతము

సమయం—సాయంత్రం

ప్రవేశం—గాంధి, పటేలు, నెహ్రూ, బోసు, రాజేంద్రుడు.

గాంధి—యోధాగ్రేసరులారా! మన భారతమాత దాస్యవిముక్తికై స్వాతంత్ర్య సమరాగ్నిలో ఆహుతియైన వీరులనుగూర్చి తలంచినకొలంది నా గుండెలు జలదరింపుచున్నవి. ఎన్నాళ్లు దాస్యభారమున మన మిట్లు కృశింపవలయునో కదా! నలుబదికోట్ల ప్రజానీకము! విశాలభారతభూమి! పరాయిప్రభుత్వ పెత్తనము! పగటికోపిక! పరదాస్యము! ఆశ్చర్యము! (రుద్ధకంఠముతో) అమ్మా! భారత జనయిత్రీ!

(కామాచి)

ఉరికంబముల నెక్కు ముదిపెంపుబిడ్డల కడపటి ప్రార్థనల్ కాంచినావు
లాఠీల కెఱయైన లజపతు లెందఱో మరణబాధల నొంద నరసినావు
మారణయంత్రాల ప్రమ్రగ్గిడి యోధుల "కెక్కరింతల" నాలకించినావు
చెఱలలో క్రమ్రగ్గిన చిన్నారిసుతులకై దరిలేనిదుఃఖాన పొరలినావు

దాస్యశృంఖలాబద్ధవై తాల్మిబూని
పెక్కుబాధల నోర్చుచు స్రుక్కినావు

సొమ్ము తిని రొమ్ముచీల్చెడి దొమ్మిగాండ్ర
పాలఁబడినావు తల్లి! ఓ భరతమాత!!

బోసు—మహాత్మా! అవును. సామ్రాజ్యతత్త్వ దురహంకారభూయిష్ఠులైన ఆ బ్రిటిషువారు చేయు దుండగములకు అంతులేదు. మన దేశమును అన్నివిధముల పీల్చి పిప్పిచేయుటయేగాక దమననీతిని ప్రయోగించి దేశీయులను దాస్యకూపమునుండి ఎన్నటికిని బయటికిరాకుండ అణగద్రొక్కుచున్నారు.

( పాట )

"పంజాబుహత్యలు" పలుమారు తలఁచిన రోమహర్షమౌనిక రోసమెక్క
"మాన్ప్రాసరంబేడు లో" మాటిమాటికి తలపోయ గుండెగుభేలున గూలిపోవు
"మీరటు, లాహోరు" మిథ్యాభియోగాల సల్పినహింసలు జమపుగోల్పు
ఆంధ్రుల బిడ్డ "అల్లూరి రాజును" హత్యచేసినకాండ ఆర్తిపెంచు
ఏమి "జతీంద్రుని" చచ్చినపాటు ఏమి?
"భగతుసింహుని" వధచేయఁబడుట ఏల?
స్వేచ్ఛకై పోరు వీరుల చిత్రవధలు
ఎన్ని వినిపింతు నోరారనిక గతేది!

(బాష్పపూరితనయనుఁ డగును)

పరిస్థితులిట్లు ప్రస్తరించి పరాయిప్రభుత్వ దమననీతి పరాకాష్ఠ నొందుచున్నను, మన స్వాతంత్ర్య సమరసన్నాహముల యొక్క ఆలోచనాపరంపరలకు అంతుకన్పించుట లేదు! విప్లవము! దేశవిప్లవము! ఆసేతుహిమాచల ఏకైకవిప్లవ నినాదము! తిరుగుబాటు కావలెను. ఆలోచనాకాండ కట్టిపెట్టుడని నా మనవి.

గాం—నాయనా! సుభాష్! సెబాస్. నీ వీరత్వమును మెచ్చుకొంటిని. నీ సాహసమును అగ్గింతును. కాని మన శ్రేయమును కోరియే మన మిట్లు దీర్ఘవిచారనిమగ్నులము కావలసివచ్చినది. నిజమైన సత్యాగ్రహి త్వరపడి అనాలోచితముగ ఏపనిని చేయ

కూడదు. ఈ విశాల భారతభూమియొక్క సమస్య ఒక్కనిముసములో నిర్ణయింపవీలగునా? ఉడుకు జుఱ్ఱుకొనిన నోరు కాలిపోవును గదా!

బో—ఆలసించినచో అమృతముకూడ విసముగా మారదా?

సె—ప్రియమైన సుభాసూ! పెద్దలతో తర్కవితర్కము లేల? నీ మనోగత అభిప్రాయమును వివరింపరాదా?

బో—ఇంకను అభిప్రాయములకొఱకు వేచియుండుటయేనా? పాలకులకు "అంత్యసందేశము" పంపి శాంతిసంగ్రామప్రకటన చేయుట ముఖ్యము. ఇకముందు అంతర్జాతీయ పరిస్థితులు చాల విషమరూపము దాల్చబోవుచున్నవి. రెండవ ప్రపంచ మహాసంగ్రామము రానున్నది. విదేశీయులందఱు తమ ప్రాణములను అరచేతులలోఁ బెట్టుకొని భయాకులిత స్వాంతులై యున్నారు. మన పాలకులగు ఆంగ్లేయులుకూడ యుద్ధపిశాచ తాండవనృత్యములో తప్పక పాల్గొందురు. ఈ సదవకాశమును జారవిడువక మనము సత్యాగ్రహమును ప్రకటించినచో వారు పాదాక్రాంతులగుదురు.

గాం—కాంగ్రెసు కార్యనిర్వాహకము సమావేశపరచి సమగ్రముగా పరిస్థితులు పరిశీలించెదము. కాని "అంత్యసందేశము" మాత్రము ప్రస్తుతముకూడదు. శాంతిసమరప్రారంభ విషయమై తగినంతగా విచారింపవలసి యుండును. దేశము సిద్ధముగా నున్నదో లేదో గమనింపవలెను.

బోసు—అన్నియు ప్రస్తుతము కూడదంటిరి. ఇక చేయునదేముండును?

(కన్నడ)

ఎప్పుడు కాదు కాదనుచు నిట్టులె కాలము ద్రోసిపుచ్చి, యీ
తిప్పలు తెచ్చిపెట్టితిరి దేశము దాస్యములోన మున్గి యిం
కెప్పుడు తెప్పరిల్లుతాను? ఈ తరుణమ్మునగాక; మీర లీ
గొప్పయమూల్యకాలమునుగూడ వృథా చననీయ పాడియే?

ప్రకా— సుభాసూ! త్వరపడకుము. మున్ను పాండవయోధులవలె నేడు మనము కాలమునకు కట్టుబడితిమి. అంత్యసందేశమువంపి అహింసాయుద్ధము సాగించుటకు నీవన్నట్లు ఇదియే తరుణము. కాని, మనము సైనికులము. సేనాని ఆజ్ఞను పాలింపవలదా?

బోసు— పెద్దలను గౌరవించెదను. కాని, కాలప్రవాహమును గుర్తింపని అంధవిశ్వాసివలె నడచుకొనుట నా మతము కాదు. ఒక్కొక్కప్పుడు సేనానికిఁగూడ జాగృతి కలుగఁజేయు తరుణములు రావచ్చును.

రాజేం— సుభాసూ! ఇంతవఱకు నీ ధీవిభవము గమనించుచుంటిని. అనాలోచితముగా సమరము సాగించినచో దేశము సిద్ధముగా నున్నదను గట్టినమ్మకము నీకు కలదా?

బోసు— అవును, కలదు. ఇందు అనాలోచితమేమియు లేదు. మనము చాలసారులు పోరాటములు సాగించితిమి. ఏవో వంకలు పెట్టి ఆపివైచితిమి. నేను శాంతి సమరానుభవము దేశీయులకు ఓపినంతకలదు. ప్రజానీకములో నూత్నచైతన్యము పెల్లుబుకుచున్నది. జాగంతయు పెద్దలదే.

రాజేం— బాబూ! పొరపడుచున్నావు. ఇది సమయముకాదు.

( మాల్కోస్ )

ముందుకుఁ బర్వులెత్తి మనమూర్ఖత వెల్లడిచేసి పెక్కుయి
బ్బందుల కాస్పదం బగుచు బాలురరీతిగ నిల్చిపోవ, యే
మందురు నవ్విపోదురుకదా! యిది నిందుజయమ్ముకూర్చునే
అందఱు సిద్ధమైన తరి ఆహవమున్ జరిపించు టొప్పగున్.

మఱియు బార్డోలీ సత్యాగ్రహ సమరసేనానియగు సర్దారుని సలహాలనైన తీసికొనవలదా? అతడు నీ ఉడుకురక్తపు దుడుకు వాలకము నంతయు గమనించుచు దీర్ఘాలోచనానిమగ్నుఁడై యున్నాడు.

బోసు—నేను సర్దారులనుగాని, పండితులనుగాని, మహాత్ములనుగాని, రాష్ట్రపతులనుగాని కాదనుటలేదు. అంతటిసలహాలును గౌరవింపదగినవే! అందఱును యుగాంతమువఱకు ఆలోచించుచుండవలసినదే! బ్రిటిషువారిపై దెబ్బతీయుతరుణము మించిపోవుచున్నదని మాత్రము నా ఆవేదన; హెచ్చరిక.

పటే—ఈ మెత్తిపోటుపులకు. హెచ్చరికలకు ఇక్కడ జంకువారెవరును లేరు. మేముమాత్రము బ్రిటిషువారిని కౌగిలించి ముద్దిడుకొనబోవుచున్నామా? కాలముయొక్క విలువ, తరుణముయొక్క పరుగును, పరువమును గమనింపనంతటి మూర్ఖులము గాము. సమరము, సమర మని ఉబలాటపడుట చాలతేలిక. కర్తవ్యపాలనము, నిర్వాహణము బహుదుస్తరము. ఆలోచన ముఖ్యము.

గాంధి—బాబూ! సుభాసూ! అహింసాసమర మన్న బాల్యక్రీడలు కావు. హింసాసమరమున పైపైలెక్కలవలన బలాబలములు తెలిసికొనవచ్చును. అహింసాసమరమున అట్లుకాదు. దీనికి సంఖ్య ప్రధానముకాదు. మారణయంత్రములు సాధనములు కావు. కత్తులు కఠారులు పనికిరావు. ఆత్మబలము, అహింసాప్రవృత్తి, చక్కని నడవడి, ధీరశాంతము, నిశ్చలమైన ఓర్పు మున్నగు మహత్తరగుణవిశేషములు అహింసాసైనికుడు అలవరచుకొన వలయును. ఈ గుణములు పైపైకొలతలవలన తేల్చుకొనదగినవికావు. కాన శాంతి సైన్యమును సిద్ధపఱచుటలో జాగుసేయుట తప్పనిసరియగును. సైన్యము సిద్ధముకానిది రణప్రారంభమునకు వీలులేదుకదా! ఈ సైన్యము కూలికి పనిచేయు హింసాసమర సైనికులవలె సులభముగా లభింపరు. దేశవిముక్తికొరకు ఐచ్ఛికముగా ఆత్మార్పణముచేయు త్యాగమూర్తులు దొరకుటదుర్లభము. అందువలన పరిస్థితులుచక్కగాం బరిశీలించి ఓర్పువహింపుమని నా సలహా.

పటే—ఈ మాత్రమేకాదు. ఈమారు అపుటకు వీలులేని మహత్తర

మైన పోరాటమును సాగించి సామ్రాజ్యతత్వమును పునాదు
లతోఁ బెకలించి పరప్రభుత్వమును ఈ దేశమునుండి శాశ్వత
ముగాఁ బారదోలి ప్రజారాజ్యము స్థాపింపఁదలఁచితిమి. ఇంకను
సంగ్రామరహస్యములు చాలకలవు. ఇట్టితరి అనాలోచితముగా
అంత్యసందేశములు పంపి దేశీయసైన్యమును సమకూర్చుకొనక
త్వరపడి యుద్ధప్రకటనచేయరాదు. హింసాయుద్ధముకన్న యీ
యుద్ధమునకు బోలెడంత సన్నాహము, సామగ్రి కావలసి
యున్నది. విజయమో, వీరస్వర్గమో యీసారి తేల్చుకొన
వలసియున్నది.

బోసు—శాంతిసమరమును సాగింతుమని అంత్యసందేశమును పంపుటకే
జంకువారు ఇకముందెప్పుడో మీనమేషములు లెక్కించి రణ
ప్రారంభముసేయుదురట! నిప్పులపై నీళ్ళుచల్లు యీ చప్ప
చప్పని హితోక్తులవల్లనే దేశీయుల సమరోత్సాహము క్రమ
క్రమముగా నశించిపోవుచున్నది. పట్టుపరుపులపై మేనువాల్చు
"పార్లమెంటరీ కార్యక్రమము" అమలులోనికివచ్చినది. రాజ్యము
హస్తగతమైనపిమ్మట జరుపవలసిన "నిర్మాణ కార్యక్రమము"
మున్నగు విధులకు నేడు ప్రధానస్థాన మీయఁబడినది. "క్రమ
శిక్షణ" పేర కాంగ్రెసులో నియంతృత్వము, నిరంకుశత్వము
ప్రబలినవి. "విమానయుగము"లోనున్న మనము తిరిగి "ఎద్దు
బండ్లయుగము"నకు త్రోయబడుచున్నాము. ఇంకెక్కడిసమ
రము! ఎక్కడి స్వరాజ్యము! నిజమాడిన నిష్ఠురముగానుండును.
మీరు కోరెడి నికరమైన శాంతిసైనికులు, ఐచ్ఛికభటులు
దొరకుటకు యుగములుపట్టును. అట్లు లభించినను మీరు ఉద్య
మము సాగించుట అసంభవము. ఒకవేళ సాగించినను ఏకొన్ని
హక్కులో యిచ్చితి మని జిత్తులమారి ప్రభుత్వము ప్రకటింప
గానే సత్యాగ్రహము సరిపుచ్చబడును. మరల ఉద్యోగకాండ
యథాతథముగా ప్రారంభమగును. ఇట్టిక్రీడలే మున్ను జరిగినవి.
ఇకముందు జరుగనున్నవి. ఇది నిశ్చయము. ముమ్మాటికిని—

పటే—పట్టి ఆవేశపూరితములైన ఉపన్యాస పరంపరలవలన స్వారాజ్యము స్వర్గధామమునుండి ఊడిపడదు. మాటలకును, చేతలకును చాలభేదముకలదు. యువకమూర్తి యగు బోసు గొప్ప త్యాగియు, నిష్కళంకుడైన దేశసేవకుడని ఒప్పుకొనక తప్పదు. కాని సమరానుభవము చాలతక్కువ. ఊహాప్రపంచములో గాలి మేడలు.

బోసు—మీ ధ్రువవ్రతములు నా కక్కఱలేదు. మీ సెబాసులకు పొంగిపోవు సుబాసు కాడితడు. నాకు కావలసినది ప్రజా రాజ్యము. స్వారాజ్యము వీరభోజ్యము. మీ క్రమశిక్షణ నిర్మాణ కార్యక్రమము, అహింసాదీక్ష, అఖండకార్యనిర్వహణదీక్షల వల్ల తెచ్చిన స్వారాజ్యము ఏదీ?

నెహ్రూ—సుభానూ! ఎంతటి నిరసనభావము! స్వారాజ్యము నీకొక్కని కేనా కావలసినది? మాకుఅక్కఱలేదా! మీరు తెచ్చిన రాజ్య మేది యని అబోధబాలకునివలె అడిగెదవా? పెద్దలను తూలనాడిన స్వారాజ్యము వచ్చునా? అభిప్రాయభేదములకై యింత గొడవ పెంచుట న్యాయమా! క్రమశిక్షణ ముఖ్యమని తెలిసి కొనవలదా! ఎంతటివెఱ్ఱి?

( కేదారగౌళ )

ఇంచుకలోపముల్ వెదకి యీర్ష్యలు పెంచెద వేలనయ్య! నీ
అంచితమైన త్యాగపథ మారడి బుచ్చగ నేల? పెద్దలన్
వంచనచేసి వారలకు వాదులు కూర్చుట భావ్యమౌనె! ఈ
కొంచెపుభేదభావమును గొప్పగసేయుట తప్పుకాదొకో?

దేశశ్రేయమును కోరువారు ఏకైక నాయకత్వమును తప్పక అంగీకరింపవలెను.

రాజేం—సెబాస్ జవహార్! చాల యుక్తముగ వచించితివి. మనము విజయలక్ష్మిని చేపట్టవలెనన్న మహాత్ముని ఆనతిచొప్పున మెలంగుట శ్రేయము.

పటే—అవును. ఐక్యత, క్రమశిక్షణ మన భారతీయులలో కొఱవడి యున్నవి. బ్రిటిషువారు ఈ క్రమశిక్షణవలననే విశాలసామ్రాజ్యమును కాపాడుకొనుచుండిరి.

బోసు—మహాత్ముని అండజేరి మీరు నియంతృత్వము చెలాయించుచున్నారు. మీలో ఉద్యోగవాంఛ దాగియున్నది. అందుచే మన "స్వరాజ్యపు గొంగడి" వేసినచోటనే పడియున్నది.

గాంధి—యువకమూర్తీ! సుభాసూ! న్యాయపథానువర్తివై ఆలోచింపుము. త్యాగమూర్తులనునిందింపకుము. అధికారవాంఛయే మనకున్నచో యీపాటికి యేరాష్ట్రపాలకులమో, వారిపితామహులమో అయియుందుము. బ్రిటిషువారి తొత్తులమై, జోహుకుములమై, జీహుజూరులమై; వారి పెంపుడుకుక్కలవలె పడియుండు ఇతర భారతీయ ఉద్యోగులవలె మనమును వారి మన్ననల బడసి దేశద్రోహులమై నికృష్టజీవితమును గడిపెడివారము. కాని అట్టి నీచమైన దాస్యభావమును నశింపజేసి, నూత్నచైతన్యము కలిగించి, సేవాధర్మమును నెలకొల్పి దేశమును స్వాతంత్ర్యపథమున నడిపించుటకే మన మిన్నిపాట్లు పడుచుంటిమి. అట్టిచో నీవంటి త్యాగమూర్తి ఇట్లుపలుకుట తగునా!

బోసు—ఈ బుజ్జగింపులకు, ఇచ్చకములకు లొంగి నా కర్తవ్యమును మఱువజాలను. సంశయాత్ము లెప్పుడును వెనుకంజ వేయుచునే యుందురు. మీ నాయకత్వమునే ఆచంద్రార్కము నిలబెట్టుకొనుడు. ఇది నియంతలయుగము.

గాంధి—సుభాసూ! నీవే దేశమును నడుపుము.

( మో హ న )

నినుకాదంచును జుట్టుకొంట కివి తేనెల్ పాయసాన్నంబులా
ఘనవహ్నీ దేశములోన మూకలను చక్కండిద్ది యుద్ధానికీ
దసరత్ జేయుట మాటలా! ఎటులో నీధైర్యోన్నతికి జూపి; నీ
మనమందున్నవిధాన సేయు మిక నే మారాడుటల్ మానెదన్

పటే—ఏమి! పాకము ముదిరిపోవుచున్నదే! అనుభవజ్ఞానలవదుర్వి
దగ్ధుడవగు ఓ బాలమూర్తీ!

(మాలిని)

మాటలువేయునేల? ఇకమానుము నచ్చినత్రోవపొమ్ము, నీ
ఆటలు సాగిరావిచట! ఆగితి వింతటిదాక ఓర్చి; నీ
పాటును చూచుకొమ్మికను భవ్యయశస్కుని గాంధిసత్తమున్
నోటికివచ్చినట్లు మది నొవ్వగ దూషణసేయ పాడియా!

గాంధి—సర్దారున కొక విషయము చెప్ప సాహసించెదను. నిజమైన
సత్యాగ్రహి పరులమనస్సులసైతము నొవ్వసేయరాదు.

పటే—తమహెచ్చరికను అంగీకరించితిని. కాని యీ యువకుడిట్లు
పెద్దలను దూషించుటకు మాత్రము సమ్మతింపము. సమయాను
కూలముగా ఆచరణయోగ్య విధానమును సూచింపవచ్చును.
అభిప్రాయభేదమును తెలుపవచ్చును. శక్తియున్నచో నూత్న
పంథా ననుసరించి దేశమును నడుపవచ్చును. కాదనువారెవరు?
ఇట్టి వాచాదోషము లేల?

బోసు—మీ బెదరింపులకిచట జంకువారెవరునులేరు. మీనియంతృత్వ
నిరంకుశవిధానములు ఇంకెన్నాళ్లు సాగునో చూచెదనుగాక!

(మధ్యమావతి)

ఏమో చేసెదమంచు పల్కెదరు నన్నీ వ్యర్థశాపోక్తు లిం
కేమైనన్ తలక్రిందుసేయునొకో! పోనీ! దేశసేవార్చన
ప్రేమల్ ఒక్కరిసొత్తు కాదుకదవే! చూపెట్టెదన్ శక్తి; ఈ
చీమల్ ప్రాకెడి వట్టి చచ్చుపిధులన్ క్షీణింపగాచేసెదన్

(అని వెళ్లిపోవును)

నెహ్రూ—త్యాగమూర్తియగు బోసు ఉద్రేకమూర్తియై నేడు వెలసి
నాడు. అతనిమనస్సు అతి సున్నితమైనది. వేడి తగ్గిన పిమ్మట
అతనిని నేను కలసికొని కర్తవ్యమును బోధింతును.

రాజేం:—ఇక యీసమావేశమును ముగించి అనంతరకర్తవ్యమును సిమ్మట కొలదికాలములో నిర్ణయించెదము.

(తెరపడును – అందరును నిష్క్రమింతురు)



## 2 వ రంగం

స్థలం:—గ్రామచావడి

సమయం:—ఉదయం 10 గంటలకు

ప్రవేశం:—వీరన్న, రామిరెడ్డి, బసవయ్య, చెంచయ్య.

రామిరెడ్డి:—యీరన్నా! యీకాంగ్రెసోళ్ళువొట్టిదగాకోర్లురా! రైతుకు అన్ని సౌకర్యాలు జరుపుతామన్నారు ఏవీ! జస్టీసువాళ్లుచూడు! ... దబ్బిచ్చేశారు. వోటుకు పదిరూపాయలకాడికి మునసబు, కర్ణములకరంగా లెక్కట్టి యిచ్చేశారు. ఆలోత్తు లిద్దరు ఏకమై ఆ... కాంతానికి ఓటిచ్చినాడికి ఒక్కొక్కరూపాయి అయినా ముట్టజెప్పారు. అట్లావుండాలికాని కాంగ్రెసువాళ్లంత వచ్చిబూతు మెక్కడాలేదు. ఓటును అమ్ముకోకూడదంటారు. నీతినియమ మంటారు. ఊరికేయివ్వమంటారు వోటు. అయినా వోట్లుతీసుకపోయి రెండేళ్లుదాటింది. మనకు వొక్క సౌకర్యం లేదు. మెడ్లబాట రొంపిరొంపిగావున్నది. ఆసుపత్రికి పొయ్యే రోడ్డు అధ్వాన్నంగావుంది. పేటకుపొయ్యేరోడ్డు చూస్తే పెద్దలు తలపుకొస్తున్నారు. ఓటిస్తే మనకు యేం వొరిగిందిరా!

—♦ పాట ♦—

కాంగ్రెసోళ్లామాట కల్లలా మూటరా
నమ్మొద్దు నమ్మొద్దుచుమ్మర్లువస్తాయి ॥కాం॥
వచ్చపెట్టెలోవోటు పడవెయ్యమన్నారు
మెచ్చుగా సొర్గాని కెగరేస్తమన్నారు ॥కాం॥

రెండేళ్ళుదాటినా బండిసున్నేగాని
రైతుకూ వొరిగింది రవ్వంత లేదురా ॥కాం॥

బసవయ్య:—సిసలుగాచెప్పావు చినరామిరెడ్డా
అసలు సౌకర్యాలె అవుచేయాలంట
శిస్తులో తగ్గింది చీమంత లేదురా
పస్తులూపడుకొన్న పాపమైనాఅనరు ॥కాం॥

వీరన్న:—ఇదేనంటూరా మీరు తెలుసుకొన్నది. సొరాజ్యంకోసం వాళ్ళెన్ని యాతన్లు పడుతున్నారో మీకేంయెరిక. కాంగ్రెసు వాళ్లంటే యేమనుకున్నారు?

—♦ పాట ♦—

కాంగ్రెసోళ్ల దెబ్బ ఘాటైనదెబ్బరా
తెల్లోడు సైతము అల్లాడిపోయ్యాడు ॥కాం॥
అసలుసంగతి మీకు ఆకలింపే లేదు
వైసురాయంతోడు దాసోహమన్నాడు ॥కాం॥
ఉప్పుచాకా చేసి ఉసురులూనిల్పారు
అప్పుచట్టముచేసి ఆస్తిదక్కించారు ॥కాం॥
కూలీలరైతులూ కుదురులూ నిలబెట్టి
సారాయివద్దనీ చట్టాలుచేశారు ॥కాం॥

చెంచయ్య:—నిజమేరా యీరన్నా! మొన్న తిలక్‌మైదానంకాడ చెప్పిన వుపన్యాసంవినలేదూ! కాంగ్రెసువాళ్లనుపెట్టిన కష్టాలు వినేసరికి తెల్లాళ్ళను నమిలి మింగుదామనిపించింది. తెల్లొడు మన తాతముత్తాతలకాలంనుంచీ రాజ్యంచేస్తున్నాడుగదా! జస్టిసోడు ఇరవైయేళ్ళబట్టీ రాచకార్యాలు దిద్దుతున్నాడుకదా! యేవీ వాళ్ళుచేసినమేళ్ళు? నిన్నగాక మొన్నవచ్చిన కాంగ్రెస్‌వాణ్ణి దుయ్యబట్టుకుంటాంగాని, అసలు రాచకార్యంఅంటేనే మాదర్‌ఛోద్దిరా. మనంనీతిగావుంటే యీరాచవీనుగులెందుకురా! యీ యెవారమంతా రామిగాడికి ఏం తెలుసు?

వీ:—అసలు యీతిప్పలన్నీ కాంగ్రెసువాళ్ళకు యెందుకువచ్చినట్టు! గమ్మునవూరుకుంటేచాలు తెల్లాళ్ళు కాంగ్రెసువాళ్ళ కాళ్ళకు మొక్కారంట్రా! పెద్దపెద్దఉద్యోగాలు యివ్వారంట్రా! 'నెహ్రూ' గొప్ప కాంగ్రెస్ మనిషి. ఆయన కుర్రాయనంట. పెద్దఆస్తిపరు డంట. ఆయన్నికూడా లాటీలతో కొట్టారంట. ఈయాతనంతా ఆయనకు యెందుకుచెప్పా అయినకాడికి తినికూర్చోలేకనా? రామిగా! నీఅభిప్రాయం ఏందిరా?

రా:—ఏమిటి వాళ్ళుఒరిగించింది? వాళ్ళుయెన్నితిప్పలుపడితేమనకేం? పన్నులేమైనా తగ్గించారా? పొగాకుమీదపన్నేసి నోటారచుట్ట కాల్చుకుంటానికి వీలులేకుండాచేశారు. సారాచుక్క సరేసరి. కలిగ్గానికైనా దొరకదుకదా! ఆజిల్లాలలో అప్పుచట్టంవచ్చినాక కానీ పుట్టకుండా పోయిందికదా!

వీ:—షావుకార్లంతా అదివరకు నీకు కారుస్తున్నారా యేం? యేదీ! లేనోడికి కానీ యిమ్మను చూద్దాం. యెగయ్యకుండావుంటే యెవరికైనాయిస్తారు. అప్పుచట్టం వచ్చింతరువాత మార్వాడీల, షావుకార్లజులుం అణగారిపోయింది. న్యాయమైనవడ్డీ అమల్లోకి వచ్చింది. కాంగ్రెసువాళ్ళు కాళ్ళునిలవదొక్కుకున్నాక చాలా చాలా సౌకర్యాలుచేస్తారు. ఇకముందు వ్యవసాయంచేశేవాడిదే భూమి. డబ్బుకలవాళ్ళు బొర్రలుపెంచుకొని నీడపట్టునకూర్చొని నాకు నాలుగువందల యెకరాలు, నాకు ఏడువందల గొర్లు అని కబుర్లు చెప్పటానికి వీల్లేదు. అందరూ పనిచెయ్యాలంట! "మాల మండీ, అరే, ఒరే" అని మాలగూడెంవాళ్ళని దూషించకూడ దంట! మానవజన్మంతా ఒకటేనంట! అంతా స్వర్గంఅవుతుం దిరా మనదేశం. అధికారం సొంతంగా కాంగ్రెసువాళ్ళ చేతు ల్లోకి రాలేదు కాని వస్తే మనరైతాంగం పండిపోదంట్రా.

రా:—అరకలుకట్టేవేళ అయింది. పదండిపోదాం. ఎప్పుడూ "యెనారా లేనా" అని ఆడాళ్ళు కస్సుమంటారు.

బ:—ఆడాళ్ళకు దడిసేవాడు యెవారానికి ఏంపనికివస్తాడు? ఆడవాళ్ళకు కూడా యీసంగతులు తెలియజెప్పాలి. వాళ్ళు అజ్ఞానంలో వుంటే మనం యెంతగింజాకున్నా పైకిరాలేము. వాళ్ళు మనతో పాటు పొలాల్లో యెలాపనిచేస్తున్నారో దేశవిషయాల్లోకూడా అలాగే పాల్గొనాలి.

రా:—ఆడాళ్ళులేనిది ప్రపంచంలో ఏవిషయంగట్టెక్కదు. వాళ్లుకూడా మనుషులేకదంట్రా మరి. వాళ్లకుకూడా సౌరాజ్యంకావాలికదూ! సౌరాజ్యంఅంటే అచ్చుగా మొగాళ్ళకేకాదురా!

చెం:—ఓరేరామన్నా, పొద్దు వాటారింది. నీవుచెప్పడానికి ఆరంభిస్తే ఘల్లునతెల్లారాల్సిందే! ముందు పొట్టతిప్పలు ఆలోచించండి. తర్వాత యితరవిషయాలు చూద్దాం. పైటాల కూడుతాగి పొలాలు పోదాంపదండి. ఇక కట్టిపెట్టండి.

[అంతా త్వరగావెళ్ళిపోతారు]

(ప్రథమఅంకం సమాప్తి)



# రెండవ అంకము



## 1వ రంగం

స్థలం:—సిమ్లాకొండలపై ప్రభుత్వభవనం

సమయం:—సాయింత్రం 3 గంటలు

ప్రవేశం:—లిన్ లిత్ గో ప్రభువు (గవర్నర్ జనరల్)

అయన కార్యవర్గములోని ఆంగ్లేయసభ్యులు ముగ్గురు

లిన్ లిత్ గో ప్రభువు:—మిత్రులారా! నేడుమనసామ్రాజ్యమునకు గొప్ప విపత్తు సంభవించినది. ఇన్నాళ్ళుమనము రాజ్యతంత్రనిపుణులమై అఖండసామ్రాజ్యమును కాపాడుకొనగలిగితిమి. కాని నేడట్టి ఆశలు కన్పించుటలేదు. జర్మనీనియంత హిట్లరు సామ్రాజ్య కాంక్షతో "పోలండు" అను చిన్నదేశముపైకి దండెత్తి దానిని తొలికబళముగా త్రింగ నుంకించు చున్నాడు. మన కేమియని మనము ఊరకొన్నచో మనబ్రిటిషులంకనుగూడ గంగలో త్రోసి మన సామ్రాజ్యమునుకూడ హరింపగలడు కాన,

(ఆనంద భైరవి)

మనసామ్రాజ్యమురూపుమాపుటకు దుర్మార్గమ్ము యోచించి,దు
ర్జనుడౌ హిట్లరుకుండగీడు దరిరాజ్యంబైన "పోలెండు"తో
అనిసేయన్ తలపెట్టినాడు మనమీఆలంబులో నేడు పా
ల్గొని "పోలండు"ను నుద్ధరింతుమను సాకున్ చెప్పగా నొప్పగున్

1 వ సభ్యుడు:—అయ్యో! ఎట్టివిషాదవార్త వినుచుంటిమి!

2:—ఇంకేమున్నది? మనకొంప మునిగిపోయినది!

3:—ఏసుప్రభూ! మా సామ్రాజ్యమును యీవిపత్తునుండి కాపాడుము తండ్రీ!

లిన్:—మీరు యీమాత్రమునకే ఇట్లు నిరాశ జెందనేల? ఇదిగో ఇండియా మంత్రిగారివద్దనుండి వచ్చిన కేబిల్ వార్త చదువుడు కర్తవ్యమును నిర్ణయింపుడు.

(1, 2, 3 సభ్యులు ఒకరితరువాత ఒకరు లోలోన చదువుకొందురు.)

లిన్:—మన జట్లండుప్రభువతంసుడు పంపినవార్త ఆమూలాగ్రముగా పరిశీలించితిరిగదా! మీ అభిప్రాయములు తెల్పుడు.

1—వెంటనే ఏడెన్, సింగపూర్, ఈజిప్టులకు సైన్యములను తప్పక పంపవలసినదే. జట్లండు మంచి ఊహాపరుడుసుమా!

లిన్—మీ బ్రిటిషు దేశరక్షణార్థము ఇండియాలోనున్న సైన్యములను పంపరాదని కాంగ్రెస్‌వారు గోలపెట్టెదరేమో?

2—వారి మొరలు అరణ్యరోదనములు. ఏదోఒక కుంటిసాకుచెప్పి వారిని చిచ్చికొట్టెదము. ఈ దేశముపై పెత్తనము వారిదాయేమి?

లిన్—మాటమాత్రమైన వారితో అనవలదా? మనమెంత పాలకుల మైనను అసలు దేశము వారిదేకదా! మనమును యీసైన్యమును వారి పోషణక్రిందనే యున్నామని మరచుట ద్రోహము. వారి చలవవల్లనే మనలంక నిత్యకల్యాణము పచ్చతోరణమువలె నున్నది.

3—వైస్రాయి పదవియందున్న మీకు యిట్టి మనసుమెత్తనితనము తగదు. అట్లైన జట్లండుప్రభువు ఉత్తరువు మాట?

లిన్—లేదు. లేదు. అంతటి ద్రోహమా!

3—కాంగ్రెసువారికి తెలుపనియెడల వారు చేయునదేమి? ఊరక సభలుచేసి గోలపెట్టెదరు. ఆగోల మితిమీరినచో ఆయుధ బలము ప్రయోగించి సులభముగా అణచివేసెదము. ఈచిన్ని విషయములకుకూడ కొన్నినిమిషములు వ్యర్థపుచ్చుట యేల? వెంటనే సైన్యములను పంపుడు.

లిన్—దమననీతి చివరిమార్గము. మనము సైన్యములను తక్షణమే

పంపినను వారికి తెలువకుండ పంపినందులకు ఒక యుక్తిని ఆలోచించి వారికి నచ్చచెప్పవలెను.

1—ఇటు సైన్యములను ఓడయెక్కించిన పిదప సెంట్రల్ అసెంబ్లీ కాంగ్రెసుపార్టీ నాయకునిపిలిచి రహస్యముగా యీ విషయము తప్పనిసరియైనదని తెలుపుదము. ఒకవేళ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు అడిగినచో మీవారికి అప్పుడే తెలిపితి మని తప్పు కొనవచ్చును. అదిగాక ఇండియా రక్షణకొరకే ఇండియా సరి హద్దులలో సైనిక నివహములను కాపుంచితి మని చెప్పెదము.

లిన్—ఈ ఆలోచన యుక్తియుక్తముగ నున్నది. కాని, కేంద్రప్రభుత్వ శాసనసభలో ఒక తీర్మానమైన పెట్టలేదేమని వర్కింగుకమిటీ వారు ప్రశ్నించినచో? — పటేలు సామాన్యుడుకాడు! చిచ్చుల పిడుగు.

2—తీర్మానము పెట్టునంతటి సావకాశము లేదు అని చెప్పవచ్చును.

లిన్—ఈయుద్ధములో మనము సంస్థానాధీశులవల్ల చాల సహాయము పొందవలసియున్నది. వారికైన తెలుపవలదా?

1—వారు మనపెంపుడుబిడ్డలు. కాంగ్రెసువారు ప్రజాస్వామ్యవాదులు గనుక ప్రజలహితమును కాంక్షించి ఆందోళనచేయుదురు. కాని మనము సృష్టించిన మనబిడ్డలైన యీ విలాసమూర్తులు మన అడుగుజాడ్డలలోనే నడచెదరు. తప్పక మనకు సాయము చేసెదరు.

లిన్—అట్లైన ముస్లింలీగు విషయము? కాంగ్రెసువారిదెబ్బ తప్పించు కొనుటకైన వీరిని లోబరచుకొనవలెనుగదా! మన తాతల నాటి రాజనీతిని మన్నింపవలదా?

2—వీరికి రాజ్యాంగవిషయములలో అంతగా పనిలేదు. మతపిచ్చి యెక్కువ. ఆపార్టీయొక్క పేరే ఆవిషయము తెలుపుచున్నది.

లిన్—ఇక హిందూమహాసభ, జస్టిస్, మితవాదపార్టీలమాట యెట్లు?

3—వీరును ముస్లింలీగువారివలెనే ఒకవర్గముయొక్క అభ్యున్నతిని కోరుచున్నామని అనుకొనేవారే కాని అఖిలభారతావనియొక్క క్షేమమును కాంక్షించువారు కారు. వీరివర్గమువారే వీరికి వ్యతిరేకులు. కాంగ్రెసుపార్టీపై ద్వేషత్వముతో మాత్రము వీరు పనికి వత్తురు. వీరికి దేశము ఏ గంగలో కలసినను నిమిత్తము లేదు. వారివర్గము, మతము, కులము ఉన్నతస్థితిని పొంది ఇతరులను పీడించుటే వీరిలక్ష్యము. అందువలన మనము చెప్పినవిధముగా నడచుకొందురు వీరు. మన అండలేనిదే వీరు బ్రతకజాలరు. వీరికి తెలుపకపోయినను, తెలిపినను ఫలితము శూన్యము.

లిన్—ఇక మరియొకముఠానుగూర్చి మనము మఱచిపోయితిమి.

1—ఓహో! కమ్యూనిస్టులా! వారివలన మనకు రవ్వంతైనను ప్రమాదము లేదు. దేశములో వారిప్పుడు పలచపలచగా ఉన్నారు. అండలేక కాంగ్రెసే శరణ్యమని అనవస్థలోనే వారిప్పుడున్నారు. వారుబలపడి కాంగ్రెసునుండి విడిపోయివచ్చినను రాజకీయజ్ఞానము, అనుభవము చాలతక్కువకలవారుగాన మన వలలో సులభముగా పడిపోయెదరు. అదిగాక వారికి గురుపీఠము రష్యా. ఆ దేశముయొక్క ఆజ్ఞ ననుసరించి వారి వర్తనముండును. వీరివలన మనకు ప్రమాదము చేకూరనున్నప్పుడు మనము రష్యాతోనే బేరములు వ్యవహారములు నడిపెదము. వీరిని లెక్కచేయు నవసరము లేదు. పైపెచ్చు మనపిలుపునంగీకరించి కాంగ్రెస్‌పై కత్తిదూయుటకు వీరు సర్వదా సంసిద్ధులు. కుర్రవ్యవహారం. కుడుముచేతికిస్తే పండుగరకం. వీరితో ఆలోచన లేమిటి?

లిన్—నేటి మనసమావేశముయొక్క వివరములను మన జట్లండుప్రభువుకు సత్వరమే నివేదించెదను. అమూల్యమైన మీ సలహాకు సంతసించితిని. వెంటనే సైన్యములనుపంపెదను. భారతసేనానికి తక్షణమే కబురంపుడు.

(తెరపడును)



## 2 వ రంగం

స్థలం—వార్ధాలో బజాజ్ భవనం

కాలం—ఉదయం 7 గంటలు

ప్రవేశం—గాంధి - పటేల్ - అజద్ - సరోజిని - రాజేంద్రప్రసాద్.

రాజేం—బాపూజీ! మనపాలకు లెంతటి ద్రోహమొనర్చిరి! జర్మనీపై నేడు యుద్ధమును ప్రకటించుచు మన దేశమునుకూడ యుద్ధమునందు పాల్గొను దేశముగా ప్రకటించిరట!

గాంధి—అవును. అనాలోచితమును, అహంకారపూరితమును అగు కార్యమొనర్చిరి. ఈదేశము వారిదనియే తలచిరి కాబోలు!

అజ—ఇండియా సైన్యములను విదేశములకు పంపినారట! ఎంతటి మోసము? మన అనుమతి పొందక, మనకు తెలియజేయక మనల నిర్లక్ష్యముగా జూచిరి.

సరో—ఏల తెలియజేతురు? సామ్రాజ్యతత్వగర్వోన్మత్తులు, పరాన్న భుక్కులు, మారణాస్త్రధురంధరులు, పరపీడాపరాయణులగు వారికి అంతటి వివేకమెక్కడ? మనమొక లెక్కలోనివారమా!

పటే—సోదరీ! నిక్కము వచించితివి. వారిదృష్టిలో మనము మానవ మాత్రులముకాదు. చీమలము. దోమలము. కనుకనే నూట యేబదియేండ్ల పైకాలమునుండి ఇండియాలో వారు ఆడినది ఆట, పాడినది పాటగావున్నది. వారి పరిపాలన నిరంకుశముగా, నిర్విరోధముగా సాగుచున్నది. ఇందుకు వారిని దూషింప పని లేదు. మనదౌర్బల్యమే కారణము.

రాజేం—భారతీయులందరును యీయుద్ధములో వారికి సహాయముచేయ వలయునని నేడొక విచిత్రమైన ప్రకటనచేసిరి. కానిసలు ఎట్లు సాయముచేయుదురని తలచిరి! పాపము! ఆపత్కాలములో వివేకము అంతరించి యుండవచ్చును! ఇండియాలో వారొనర్చిన

దారుణ హింసాపరంపరలు వారు మఱచిరికాబోలు? ప్రజలెట్లు మఱతురు?

గాం—అపకారికి ఉపకారముచేయుట ధర్మము. ఇది భారత సాంప్రదాయము. హైందవనాగరికతాచిహ్నములకు ప్రాతిపదిక.

పటే—బ్రిటిషువారి అపకారపరంపరలు ఎన్నియని సహింతుము? "ఈస్టుయిండియా కంపెనీ" పరిపాలనకాలమునుండి నేటివరకు వారొనర్చిన ఘోరదురంతములు నలుబదికోట్ల భారతీయుల నరనరములలో రక్తసికంప ముళ్ళవలె నాటుకొని ప్రతిక్షణము "చురుక్కు" మను తీవ్రబాధావిలసంయుతములై వారి చర్యలను జ్ఞప్తికి దెచ్చుచున్నవి. ఇట్టిచో తెఱ ధర్మపన్నములకు, నీతులకు తావెక్కడ? ఎట్లు? నిజమాడిన నిష్ఠురముగానుండును. మన దేశములో నేడు ఏమిఅశాంతికలదు? ఇట్టి శాంతివాతావరణము నందుకూడ ఆర్డినెన్సులా? "రక్షణచట్టములా"! దేశమంతయు యీ "అవసరకాలమందొనర్చు భీషణచట్టము"ల ప్రయోగములకు భయభ్రాంతమగుచున్నది. ఈచట్టములవలన మన మందరము "కే. డీ."ల మైతిమి. మనపౌరసత్వపుహక్కులకు భంగపాటొనర్చిరి. మనలను పరాభవమొనర్చిరి. అందువలన ఉపకారము" అను ధర్మ మిచ్చట పాటించుట ధర్మసమ్మతము కానేరదు.

అజ—జర్మనీదేశము మనదేశముపై యుద్ధము ప్రకటింపలేదు కదా? మానవపీడాపరాయణులు స్వార్థపరులై సామ్రాజ్యకాంక్షతో కీచులాడుకొను యీ ఘోర మారణక్రియాకలాపములో మన దేశమును, మనలను త్రోయుటయేల? పరాయిపీడ మన నెత్తిపై పులుముటయేల? ఈ యుద్ధముజోలి మనకేల?

నరో—ఏలనా? మనము బానిసలము. బానిసలకు "మన" అనునది ఎన్నటికినీ యుండదు. సర్వము యజమాని అధీనము. కావున

ఈదేశమునుకూడా "యుద్ధములో పాల్గొనిన దేశము"గా బ్రిటిషు ప్రభువులు ప్రకటించిరి.

ఎక్కడనో యున్న "పోలాండు" అను చిన్న దేశముయొక్క స్వాతంత్ర్యమును రక్షించుటకై మన "దయాధర్మ స్వరూపులగు" బ్రిటిషు ప్రభుసత్తములు తమ "విశాలసామ్రాజ్యము" నంతను యుద్ధములో పాల్గొన జేసిరట! వారి బ్రతుకుదెరువు దేశమగు యీ "రత్నగర్భ" యొక్క స్వేచ్ఛా, స్వాతంత్ర్యముల విషయమై కాలక్రమమున, యుద్ధానంతరము ఆలోచింతురట! అట్టివారికి "ఉపకారము" చేయవలెనట!

రాజేం—సోదరీ! నిజము. నిజము. నూటయేబదియేండ్లనుండి స్వారాజ్యమునకై మనము గోలపెట్టుచున్నను పెడచెవిని బెట్టి మనలను ఎప్పటికప్పుడు కాలక్రింద నుట్టుచు అణగద్రొక్కుచుండిరి. నేడు "అడుగకయే, అర్థింపకయే" తమకు సంబంధములేని పోలండు దేశమునకు అండగా నిలచి తమతోగూడ "మానవహింస"కు తయారుకావలెనని మన ప్రభువులు మనలను ఆజ్ఞాపించిరి! ఇట్టి దారుణచర్యకు వారి స్వార్థచింతనకంటె మన అసమర్థతయే గొప్పకారణము!

గాంధి—త్వరపడిన వివేకము కోల్పోవుట సహజము. బ్రిటిషువారి అపకారపరంపరలకై మన ప్రేమసిద్ధాంతమును ప్రయోగించి వారి దురంతచింతనలను యెత్తిపొడుచుచూపి వారి "కఠినకర్కశ" హృదయములను అచిరకాలమునే కరిగించవచ్చును. మన సమర్థత చూపు కాలము సమీపించినది. వారి సామ్రాజ్యము నశించుసమయమును కూడ దాపురించినది. ఇట్టి తరుణమున మీరు త్వరపడుట తగదు. రాష్ట్రపతి! బాసుబాబు యింకను రాలేదేమి?

రాజేం—మద్రాసులో నున్నాడట. వచ్చెదనని తంతి పంపినాడు.

గాంధి—జిన్నాగారికికూడ కబురంపితిరకదా!

రాజేం—పంపితిమి. కాని, వారమురోజులలో వారికి "పార్టీమీటింగు" కలదట! వచ్చుటకు అవకాశములేదని తంతి పంపినారు.

పటే—జవహరునుండి వార్త వచ్చినదా ?

రాజేం—ముందువార్తయు పిమ్మట వారును వచ్చిరి. చాల అలసి యుండిరి, బసలోనున్నారు. వచ్చెదని కబురంపినారు.

సరో—బోసు, నెహ్రూలుకలసి ఇటే వచ్చుచున్నారు. వీరికి నూరేండ్లు పూర్ణఆయుర్దాయము ఉన్నది. వీరైన తప్పక స్వరాజ్యము చూతురని తలచెదను. అదుగో!.

(ఇంతలో బోసు, నెహ్రూలు వచ్చెదరు.)

బోసు—నూరేండ్లుకూడ అక్కరలేదు. మీ వర్కింగుకమిటీ ప్రముఖులు తాత్కాలికత్వము వీడనాడినచో అందరమును మన జీవిత కాలములోనే కొలది నెలలలోనే స్వరాజ్యమును అనుభవింతుము.

గాం—సుభాసూ! కుశలమా!

బోసు—తమ కృపావిశేషమువలన—

గాం—జవహార్! క్షేమమా!

జవ—తమ ఆశీర్వాదబలమువలన—

రాజేం—ప్రియమైనసుభాసూ! నీజోస్యమే నిజమైనది. ప్రపంచ సంగ్రామము రానేవచ్చినది. ఇక మనకర్తవ్యము సత్వరమే బ్రిటిషు వారికి తెలిపి యీ యుద్ధసమయములో మనభవిష్యత్తును సరిదిద్దుకొనవలెను. కనుకనే యీసమావేశమునుకూర్చితిని. నీఅభిప్రాయముకూడ వివరింపుము. వెనుకటి వాగ్యుద్ధములను అందరును మరచిపోయి ఒండొరులు సుహృద్భావమును ప్రకటింపవలెనని కోరుచున్నాను.

బోసు—ఈ సంగ్రామసమయ గాఢాంధకారములో చక్కని వెలుగు

బాట కన్పించుచున్నది. ఇదిమంచితరుణము. కాన, తక్షణమే పాలకులకు "అంత్యసందేశము"ను పంపుదు.

రాజేం—పాలకులకు అవకాశమిచ్చి చూడవలెకదా! సుబాసూ!

స్వహా—అవును. వారి ఆశయములేవో యీ యుద్ధకాలమువంటిదైన వారిహృదయము మారెనో లేదో ముందు మనము కనుగొని పిమ్మట "అంత్యసందేశమును" పంపిన ఉచితముగా నుండును.

బోసు—ఆశయములా! కరుడుగట్టిన సామ్రాజ్యతృష్ణ ప్రజాపీడన. పరాయిదేశముయొక్క సంపత్తితో పొట్టలు నింపుకొనుచు ఆ నీచపుబ్రతుకును "సామ్రాజ్యవైభవములు, రాజ్యాధికారములు" అని తోడి ప్రజాపీడాపరాయణుల సమ్ముఖమున వెల్లడించుకొనుట! అంతకుమించి యికనేమున్నది? ఇక వారిని కనుగొన్నచో యుద్ధానంతరము ఆలోచించెదమని చెప్పెదరు. తమ ఆశయము "స్వాతంత్ర్యమును అన్నిదేశములకు చేకూర్చుటకే యీ యుద్ధమును నడుపుచున్నా"మని పైకి మృదుమధురోక్తులతో వెల్లడించెదరు. బ్రిటిషువారి మనస్తత్వము మనమెరుగనిది కాదుకదా! ఎందుకీ జాగు!

అజ—వారిప్రేలుపెట్టి వారికన్నునే పొడువవలెను. అడిగిచూచెదము గాక!

సరో—మనమాట మనము దక్కించుకొనవలెను. అడుగుట మంచిదే.

వల్లే—అడుగుటలో మెత్తదనము పనికిరాదు. జవహారు చిత్తుతీర్మానము తయారుచేసిన బాగుగ నుండునని తలచెదను.

రాజే—చీనాయుద్ధభూమినుండి విమానముపై నేడే వచ్చిన వ్యక్తి తయారుచేసిన తీర్మానము బ్రిటిషువారి "నసాళము"లకు అంటునట్లు నిప్పులుగ్రక్కుచు ఉద్రేకపూరితముగ నుండుట సహజము. తీర్మానమునందు అట్టితీవ్రత యుండరాదు. చప్పగా నుండ కూడదు.

బోసు—శ్రీవతకూడదట! ఏమేమో వారిని అడుగవలెనట! పిమ్మట ఏదో చేతురట! ఎద్దును అడిగి గంతగట్టెదరట!

రాజేం—సుభానూ! ఒకింత ఓర్పువహింపుము. ఎక్కువకాలము జాగుసేయుట మా అభిమతముకాదు. బాపూజీ! తమ అభి ప్రాయమును వివరింపక మౌనముద్రాలంకారులై ఇంకను కూర్చుంటిరేమి?

గాంధి—ఆలోచనాపరులగు యువకులు, పెద్దలు దేశశ్రేయమును కాంక్షించి ముందడుగువేసి సక్రమ కార్యాచరణమార్గమును నవ్యముగా సూచించుచున్నప్పుడు "సరే" అనుట తప్ప వేరొకమార్గమును పట్టుట ఉచితముకాదు. అందుచే మౌనమువహించి ఊరకుంటిని. జవహరే తీర్మానమును తయారుచేయుట శ్రేయము. నీపైన హెచ్చుతగ్గులున్న మనమందరము కలసి సవరించెదము.

రాజేం—తీర్మానస్వరూపము ఎట్లుండవలెనో సెలవిండు.

గాంధి—బ్రిటిషువారి దుండగములు ప్రస్తుతమునకు మఱచి వారిని మన్నించి వారియుద్ధాశయములు ఎవ్వియో నత్వరము తెలుపమనుట యొకటి—ఇంకను ప్రస్తుతపరిస్థితి సమీక్షించేయగా—

(బిలహరి)

దేశాలుదోచుక తినుటకై హిట్లరు సమరంపుకోరవితో సాగినాడు
చిన్నదేశాలలో చిచ్చుముట్టించుచు వికటాట్టహాసాన వెడలినాడు
లోకమంతయుకూడభీకరా ర్తినిచెందియుద్ధ"మారిని"చూచియుమిసినారు
మనల దాస్యమ్ములో మగ్గజేసిన "వారు" గొప్పవిపత్తులోకూలినారు

కాన; రొయి తడిచేయుట మాని మనము
మరతులేకుండ సాయమ్మునలుపవలయు
"వారు" సమరాన విజయమ్ము బడసినంత
ఒప్పగింతురు రాజ్యమ్ము తప్ప దిదియు.

బోసు—ఏమేమి! ఈనీకపుటోర్పు, శాంతము ఏచరిత్రలోను విన్నది, కన్నది కాదు. రెండుశతాబ్దులనుండి మనల నణగద్రొక్కిన జాతి తన స్వార్థమునకై సామ్రాజ్యతృష్ణతో యుద్ధమున పాల్గొను చుండగా పీడితప్రజానీకము నోరుమెదల్పక యీ ప్రభుసత్తము లకు సాయముచేయవలెనట!

(ధన్యాసి)

అరరే! సాయముచేయగావలెన! ఈ ఆంగ్లేయులే మున్ను; భీ
కర సంగ్రామములోన సాయమెటులో గైకొంచు వెన్వెంట; దు
ర్భరమౌ హింసలపెట్టలేదె! మసలక పంజాబుదేశమ్మునన్
మరపున్ జెందితివే "మహాత్మ!" ఎటు లీ మాటాడ నోరాడెనో!

పటే—మహాత్మా! మీరేమిచెప్పినను ఇకమీదట మనపాలకులను నమ్ముటకు వలనుపడదు. వారి గతిచరిత్రయే, వాగ్దానభంగములే మనకు ప్రబలసాక్ష్యములు. కాన యీ మాయయుద్ధమునకు మనము తోడ్పడరాదు.

(నాదనామక్రియ)

సాయము మాటవిన్న మనసంతయు సూదులుగ్రుచ్చుకొన్నయ
ట్లాయెను! వారొనర్చిన హత్యాంకిత దారుణహింసలన్ని యే
మాయెను? చండశాసన పిశాచము లెట్టుల మాయమయ్యె! యే
చాయనుజూచినన్ మనసు సాయముచేయుట కొప్పదిప్పుడున్.

నెహ్రూ—బాపూజీ! మీరిట్లు వచింతురని ఎన్నడును నేను ఊహింపలేదు. "రవియస్తమింపని సామ్రాజ్యమున్నవారికి" యీ "బానిసలు" సాయముచేయుటయేల? వారు కోరుటతప్పు. మనము ఊకొనుట అంతకన్న ముప్పు.

(మోహన)

వాని దొరంగి దేశమిటు వ్రక్కలు ముక్కలుచేసి రాజ్యమున్
చేసినవారి కెట్లు [illegible]జేతుల సాయముచేతురయ్య! ఈ

మోసము మున్ను చెల్లినది; ముందిక చెల్లదు మోసపోము వి
శ్వాసము లేనిజాతి కిక సాయముచేయుట యన్న లొంగుటే.

అజా—మహాత్మునిహృదయములో యుద్ధభీరువులైన బ్రిటిషువారు చొర
బడి "పిరికిమాటలు" పలికించుచున్నారు. లేకున్న శాంతిసమర
నిర్మాత, సహాయనిరాకరణ ఉద్యమప్రదాత, భారతదేశభాగ్య
విధాతయగు మహాత్ముడా యిట్టిసలహా నొసగునది? మహాత్ముని
ప్రేమసిద్ధాంతము, అజాతశాత్రవతత్వము ఇట్టిసమయమున ఈ
"జాతి" వారిపట్ల ప్రయోగించి మనము మరతులేనిసాయము
చేసి వారిని కాపాడినను; వారుకృతఘ్నులుగనుక మనకుస్వేచ్ఛా
స్వాతంత్ర్యములు కలలోనైన యిచ్చుటకు ఒప్పుకొనరు. కాన,
పరిస్థితు లెట్లు మారినను మనము యీ పాడుయుద్ధములో
మాత్రము పాల్గొనక వారినిప త్తిడిచేసి వారి 'యుద్దాశయములు'
ఎవ్వియో సత్వరమే తెల్పుకొనవలెను. మహాత్మా! తమరిట్లు
తెల్పుట ధర్మసమ్మతముగాదని మనవి. "వారు" మన కొనర్చిన
మహోపకారమునకా సాయము!

(సా ద నా మ క్రి య)

గడచిపోయిన క్రూరంపు కథలు తలప
ఎట్లునోగాదు తమకైన స్తుతుపచింప!
పాలకులపైని ప్రేమమ్ము పనికిరాదు
వలదు వలదింక సాయమ్ము వలదుబాబు!

సరో—వారికి తోడ్పడుటయన్న మన అసమర్థత పూర్తిగా వెల్లడించు
కొనుటయగును. ఆ మహాశయులు — మనజాతిని —

( మాం డ్ )

పోటుబల్లెముచూపి నూటడెబ్బదియేండ్లు ఘోరదాస్యమ్ముస క్రుక్కినారు
చచ్చువిద్యలునేర్పి చదువుసన్నముచేసి అజ్ఞానమును నెత్తికంటినారు
పన్నులెక్కువవేసి బంగారమును దోచి దేశమంత పకీర్ల చేసినారు
"అక్టు" లెన్నియొ చేసి ఆయుధమ్ములులాగి శౌర్యాగ్నిలో నీళ్లుచల్లినారు

దానినలమాచు నెట్టులో బ్రతికినాము
ఇట్లు బ్రతుకుటకూడ సహింపలేక
పాలకులు నేడు సమరాన కూలద్రోసి
మసిరొయొనర్పగ నెంచిరి మనల నింక!

రాజేం——బ్రిటిషువారికి యీద్వితీయ "మానవ మారణహోమము"లో సహాయపడుట యన్న పామునకు పాలుపోసి పెంచినట్లగును. మహాత్మా!

(నాదనామక్రియ)

మీ అహింసాప్రభావమ్ము మేరమీరి
వారొనర్చిన హింసలు వదలివైచి
మన స్వరాజ్యపు సమరమ్ము మఱచినారు
కొఱవితోడను తల గోకికొన్నయట్లు.

గాంధి——మిత్రులారా! మీరు త్వరపడుచుంటిరి. నాఅభిప్రాయమును మాత్రమే వెలిబుచ్చితిని. కాని మీసంకల్పములను, ఉద్దేశములను కాదని అడ్డుకొనలేదు. బ్రిటిషువారి గతచర్యలన్నియు నాకు అనుభవైకవేద్యములే. వారినికాని, వారిదుశ్చర్యలనుకాని, వారి రాజనీతినిగాని, వారి సామ్రాజ్యతృష్ణనుగాని నేను సమర్థించుటలేదు. కలలోనైన అట్టిఊహకూడ కావులేదు. చంపదగినయట్టి శత్రువు తనశరణుజొచ్చినపుడు కాపాడుట వివేకముగల వ్యక్తికి,సంఘమునకు, దేశమునకు, జాతికి ముఖ్యకర్తవ్యము. అట్టివిధిని నెరవేర్చుట మనధర్మమని మీకుసలహానివ్వదలచితిని. అట్టచో, మీరిట్లు ఆగ్రహానలము వెళ్ళగ్రక్కనేల?

బోసు——మీ అభిప్రాయము ప్రస్తుతసమయమున అమలుపరచుటకు వీలులేదని తెలుపుటకే.

గాంధి——ఓహో! అట్లైననేనుఎక్కువజోక్యముకలుగజేసికొనుటతప్పు. మీరు కాంగ్రెసు అధికారవర్గమువారు. నేను "పావలాచందాదారుడను" కూడ కానట్టి సామాన్యుడను. మీ యిచ్చవచ్చిన

తీరున తీర్మానమొనర్చుటకు మీకువాక్కు కలదు. ఈ ప్రక్కనే యున్న విశ్రాంతిగదియందుండెదను. మీకునమ్మతమైనచో తయారుచేసిన తీర్మానమును నాకు చూపెట్టుడు.

(అని వెళ్ళిపోవును)

రాజేం.—మహాత్ముని ప్రేమసిద్ధాంతము అపూర్వమైనది. ఐనను మన అభిప్రాయములుకూడ ఇట్టి క్లిష్టసమయమున సులభముగా త్రోసివేయతగినవికావు. జవహర్! తీర్మానమునుతయారుచేసితివికదా?

నెహ్రూ.—ఇదిగో చదువుచున్నాను. తప్పులున్న సవరణలు ప్రతిపాదింపుడు.

(యుద్ధాశయ తీర్మానము)

“బ్రిటిషు ప్రభుత్వమువారు జర్మనీదేశముపై యుద్ధమును ప్రకటించుచు హిందూదేశమునుకూడ యుద్ధములో పాల్గొనుదేశముగా ప్రకటించిరి. యుద్ధప్రారంభమునకుముందు ఇండియాసైన్యములను ఈజిప్టు మున్నగు దేశములకు పంపిరి. భారతజాతీయమహాసభవారి అనుమతిలేకుండ యీపనులు చేసిరి. కాన బ్రిటనులోనున్న ఇండియా ప్రభుత్వశాఖవారి యీ చర్యలకు కాంగ్రెస్ కార్యవర్గమువారు తమ తీవ్ర అసమ్మతిని వెలిబుచ్చుచున్నారు.

ఈ ద్వితీయ మహాసంగ్రామములో బ్రిటిషు ప్రభుత్వమువారు ఏ ఆశయములతో పాల్గొనిరి? హిందూదేశస్వాతంత్ర్యము విషయమై వారి పంథా ఇకముందు ఎట్లుండును. వారి యుద్ధ ఆశయములు ఇండియాకు ఎట్లు అనువర్తించును?

ఈ పై ప్రశ్నలకు వెంటనే తృప్తికర సమాధానము తెలుపుతూ ప్రభుత్వమువారు ఒకప్రకటన చేయవలెనని ఇండియా మంత్రిగారిని కాంగ్రెస్ కార్యవర్గమువారు అధికారపూర్వకముగా కోరుచున్నారు.”

బోసు—మెత్తని కత్తికోతలకు మేరుపర్వతము తెగునా! ఈప్రశ్నలకు వారు సమాధానము సంతృప్తికరముగా ఈయనిచో మనమేమి చేసెదమో తీర్మానమునందు లేదు.

నెహ్రూ—బ్రిటిషువారి సమాధానము అందినపిమ్మట కాంగ్రెస్ విధానము వెల్లడింపబడును. ఆవిషయము తీర్మానములో అనవసరమని తలచెద.

బోసు—అట్లైన నే నీ సభలో నుండుటకూడ అనవసరమే? కాంగ్రెసు కన్య ఇంకను బ్రిటిషుమునలివిటునిపై మోహము విడనాడలేదు. జిన్నా మీపిలుపునందుకొనక ధన్యుడైనాడు. నాఅభిప్రాయములకు రవ్వంతయైన తావులేనపుడు నే నిచ్చటనుండుట పొరపాటు. అసలు వచ్చుట అంతకంటె హేయము.

(అని పోవును)

నెహ్రూ—బోసుగారికి యీ తీర్మానము రుచింపలేదు. ఇక మిగతా సభ్యులఅభిప్రాయములు విశదపరచుడు; సవరణలునూచింపుడు.

పటే—తీర్మానము రాజకీయనిపుణత్వమును వెల్లడిచేయుచు తరుణమునకు తగినట్లున్నది. మహాత్మునకు చూపి ఇండియామంత్రిగారికి వెంటనే పంపుడు. మిగతాసభ్యులు తీర్మానమునకు సుముఖులని యెంచెదను.

రాజేం—అట్లే యొనర్చెదను.

(అందరును వెళ్ళెదరు)

(2 వ అంకము సమాప్తి.)



# మూడవ అంకము

## 1వ రంగం.

స్థలం—లండనులో ఇండియాభవనం.
సమయం—ఉదయం 7 గంటలు.
ప్రవేశం—జట్లండ్ - హోరు - క్రిప్స్.

జట్లం—సహచరులారా! — మనము మిక్కిలి ఆపదలో నున్న యీ యుద్ధసమయమున భారతకాంగ్రెసువారు తమ దేశమునకు స్వరాజ్యము కావలె నని ఒత్తిడిచేయుచున్నారు. కాంగ్రెసు కార్యనంఘమువారు ఒక పెద్దతీర్మానమునుకూడ పంపినారు. ఇప్పుడు యుద్ధముకంటెకూడ గొప్పచిక్కు తటస్థించినది.

హోరు—నిజమే. కాని యీచిక్కును సులభముగా విడదీయవచ్చును.

క్రిప్స్—ఎట్లు?

హోరు—ఇండియాలో హిందువులకు మహమ్మదీయులకు బద్ధవైరము. ఆ వైరమును మొదట సృష్టించినది మనమే. ఆ సృష్టించిన మన బిడ్డకు "ముస్లింలీగు" అను పేరుపెట్టి ఆబిడ్డను ముస్లింమతం అంటే ఏమిటో ఎరుగని, ఆ మతసిద్ధాంతములు కలలోనైన ఆచరణలో పెట్టని ఒక నామమాత్ర ముస్లిముకు, అచ్చగా మనవేషమును, మననాగరితను, మనచదువును, మనఆచారమును అభిమానించి, ఆదరించి, ఆచరించు ఒక బారిస్టరుకు అంటగట్టితిమి. అతడు ఆ బిడ్డను తానే కన్నట్లు నటించి, పెంచి పోషించుచు నవాబ్ జాదాలు, జాగీరుదారులు మున్నగు శ్రీమంతులచంకలలో ఇరికించి, మురిపించుచు వారి ఆదరణాభిమానములనుచూరగొని ఇండియాలో మనకు అండగానిలచియున్నాడు. కాబట్టి "ముస్లిం

లీగు''కు కాంగ్రెసుకు ఏకాభిప్రాయంకుదిరినపిమ్మటనే స్వరాజ్య విషయము ఆలోచింపబడు నని కాంగ్రెసు కార్యవర్గమువారికి తెలిపెదము. కాంగ్రెసుఅచ్చుగా "హిందూసంస్థ" యని మనము "ముస్లింలీగు" కలసి ఇదివరకే ఇండియాలో తగినంత ప్రచార మొనర్చితిమి. ఈసమయమున మనకు ఆ "విష ప్రచారము" అక్కరకువచ్చినది. ఇందులకు మనపూర్వులను, వారి ముందు చూపును మనము అభినందింపకతప్పదు. మనచేతిలోని కీలు బొమ్మయైన "ఆ ముస్లింబారిష్టరు''కు మనజోహారులు. అతడు మనసామ్రాజ్యమును ఇండియాలోనైన చిరస్థాయిగా నుండుటకు సర్వదా కోరుచుండెడి ప్రాణమిత్రుడు. ఆప్తబాంధవుడు.

జట్లం—అవును. వైస్రాయికూడ ఇట్టినలహాయే పంపినాడు. కాని—

క్రిప్స్—ఇటువంటిదురాలోచనలు, కుయుక్తులవల్లనే నేడు మనకీ ఆపద సంభవించినది. సామ్రాజ్యములు, భోగభాగ్యములుచిరకాలము ఒకేజాతిని, ఒకేవ్యక్తిని అంటిపెట్టుకొని యుండవని చరిత్ర ఘోషించుచున్నది. ఎన్నాళ్ళు ఒకజాతిని ఇట్లు అణగదొక్కి పరిపాలించుచు మనపొట్టలునింపుకొనెదము? ఎన్నాళ్లు 40 కోట్ల ప్రజలను మోసపుచ్చెదము ? దేశము వారిది. ఎప్పుడైనను వారి దేశము వారికి ఒప్పజెప్పక తప్పదు. ఇప్పుడే మన మర్యాద దక్కించుకొనవలెను. కాంగ్రెసువారు మనము చిక్కులలోనున్న పరిస్థితి గమనించి ప్రస్తుతము "స్వరాజ్యవాగ్దానము" మాత్రమే కోరినారు. వారి సద్భావము ప్రశంసార్హము.

హోరు—ఇండియా మనచేతినుండి జారిపోయినచో మన మిక ఇనుము, బొగ్గు తిని జీవింపవలసియుండును.

క్రిప్స్—అట్లనిన మనస్వార్థముకొరకు ఒకవిశాలదేశమును బలియిచ్చుట భావ్యమా ! అట్టిచో హిట్లరు నేల నిందింపవలెను ?

జట్లం—వాదోపవాదముల కిది తరుణముకాదు. కాంగ్రెసు తీర్మాన మునుగూర్చి ఆలోచింపుడు.

క్రిప్స్—"యుద్ధము ముగిసినపిమ్మట అధినివేశ స్వారాజ్యము తప్పక యిచ్చెదము. ప్రస్తుతము యుద్ధమునకు పూర్తి సహాకారము చేయుడు" అని వెంటనే ప్రకటింపుడు. ఇదియే కాంగ్రెసువారి కోరిక.

హోరు—"ఇప్పుడే సంపూర్ణ స్వాతంత్ర్యము యిచ్చితిమని ప్రకటించి బ్రిటిషువారు తమ పెట్టుబడులు, ఆస్తులు, పరిపాలనారక్షణ బాధ్యతలు పూర్తిగావదలుకొని ఇండియానుండి నెత్తిన చెరగు వేసికొని ఇంగ్లండుకు తిరిగిరమ్మని" వెంటనే ప్రకటించినచో ఇంకా బాగుండును. ఇది క్రిప్సుగారికి సమ్మతమని అనుకొందును.

క్రిప్స్—కాదు. కాదు. "మీ ఇండియాను చిరకాలము మా బ్రిటిషువారు, వారివారసులు, ప్రతినిధులు మాత్రమే పంపాలించెదరు. రెండు మూడు శతాబ్దములనుండి ఇండియా మాకుభుక్తమైనది. కనుక మాహక్కును, భుక్తమును మేము ఏపరిస్థితులలోను వదలుకొనజాలము. వదలుకొనము. మీలో మీకు విభేదములు అనంతములుగా నున్నవి. మీరు ఏకజాతి, ఒకేకులము, ఏకమతము, ఏకవర్గమువారుకారు. ఒకపక్షమువారికి స్వారాజ్యమిచ్చినచో మైనారిటీలను అణగద్రొక్కి స్వార్థపరులై దేశమును ధ్వంసమొనర్చెదరు. మీక్షేమమునుకోరియే మీకు స్వాతంత్ర్యమును ఎన్నటికిని ఇవ్వదలచుకొనలేదు. మీకు పాలనావిధానములు తెలియవు. కాన మీరు స్వారాజ్యమునకు తగరు" అని ప్రకటించినచో హోరుగారికి తృప్తికలుగునని తలచెదను.

జట్లం—డియర్ క్రిప్స్! నీవట్లు హోరును తూలనాడుటతగదు. మనదేశము యొక్క జాతియొక్క క్షేమమునుకోరియే వారట్లు తెలిపిరి. అదిగాక మనపార్లమెంటుసభలో నున్న "మెజారిటీ" పక్షమువారి అభిప్రాయమును వెల్లడించిరి. మనముతప్పక మెజారిటీ సిద్ధాంతమును ఆమోదింపవలెనుకదా ?

క్రిప్స్—అట్లైన యీసమావేశమునకు మైనారిటీపక్ష ప్రతినిధినైన నన్ను వలపిలిచితిరి ? ఇండియాకు స్వాతంత్ర్యము ఎగనామము పెట్టుటలో అన్నిపక్షములు ఏకమైనవని లోకమునకు చాటుటకా ? బ్రిటిషుప్రజానీకము ప్రపంచ స్వాతంత్ర్య వీరులపక్షముననే ఎల్లప్పుడును నిలచియుండును. బ్రిటిషుపెట్టుబడిదారులు, శ్రీమంతులు, పాలకవర్గమువారు మాత్రమే స్వార్థపరులై ఇతరుల స్వాతంత్ర్యమును అరికట్టజూచుచు పరాయిదేశములను అణగద్రొక్కుటకు కుయుక్తులు, కుతంత్రములు సర్వకాలములందును పన్నుచుందురు.

ఇట్లం—డియర్ మిస్టర్ క్రిప్స్ ! నీస్వజాతినే నీవునిందించి కులద్రోహివగుచున్నావని నేడు నేనుచెప్పుటకు వెనుదీయను. అసలుసత్యమును నీవు గ్రహించుటలేదు. మేమును కాంగ్రెసువారి కోరికను నిరాకరించుటలేదు. ఇండియాకు అధినివేశస్వరాజ్యమును క్రమక్రమముగా ఇచ్చుటయే మా సంకల్పము.

1919 లో అధినివేశస్వరాజ్యమును మొదటిసారి వాగ్దానము చేసితిమి.

1929 లో ఇర్విన్ప్రభువు రెండవసారి వాగ్దానమొనర్చెను.

1935 లో "ఇండియాప్రభుత్వచట్టము" చేయుచూ యీ మన హోరుగారే కడపటివాగ్దాన మొనర్చిరి.

1937 లో ఆ వాగ్దానము ననుసరించియే "రాష్ట్రీయస్వపరిపాలనము" ఇండియాలో ఏర్పరుపబడినది.

ఇట్టి చరిత్ర ప్రసిద్ధవిషయములను, బ్రిటిషువారి సద్భావములను నీవుకాలద్రోసి జాతివిద్రోహివై పరజాతిపక్షపాతివైతివి.

క్రిప్స్—ఓహో ! మనపాపములకు మనమే ప్రొయిక్కొన్నట్లు మన గొప్పలే మనము చెప్పుకొనుచు మనలో మనమే సంతోషించుచున్నాము. ఈ శుష్కవాగ్దానములతో పాటకిపనిలేదు. దేశము

వారిది. వారుకోరిన రాజ్యాంగవిధానము వారు నిర్ణయించుకొన వలెను. నిజమైన "ప్రజాపరిషత్తు" వారికి కావలెను. పరాయి ప్రభుత్వపుజోక్యము వారికి గిట్టదు. స్వయంనిర్ణయహక్కును, సంపూర్ణస్వాతంత్ర్యమును వారు కోరుచున్నారు. మాంటేగు, చెలమ్స్‌ఫర్డు కాలమునుండి నేటివరకు మనము వాగ్దానములు చేయుచునే యున్నాము. వారిని పసిపిల్లలవలె నెంచి వారిలోని స్వార్థపరు లనెడి దాదులను అండజేసికొని జోకొట్టుచున్నాము. నేడు వారికి చైతన్యము కలిగినది. ఇక మనఆటలు సాగవు. ఈ విషయములు నీవుగాని, ఏ ఆంగ్లేయుడుగాని తనగుండెపై చెయ్యి వేసికొని పాపచింతతో కాదనగలడా? అని నేను ఏసుప్రభువు సముఖమున మిమ్ము ప్రశ్నించుచున్నాము.

జట్లం—మై డియర్ మిస్టర్ క్రిప్స్! నీవును ఆంగ్లేయుడవే. బాగుగ విమర్శించి ఆలోచించుకొనుము. నీజాతిని నీవు నిర్మూలనమొనర్ప కోరుచున్నావు! నిజముగా భారతీయులపై మనకు ద్వేషము కలదా? నేటివరకు మనజాతికి భిక్షపెట్టినది ఆదేశము కాదా! వారి ఉప్పు పులుసు మనము తినుచుండుటలేదా! ఆ విశ్వాసముతోనే మనము ఇండియాను పాలించుచున్నాము. వారు మనకు మనదేశమునకు తిండి పెట్టుచున్నారు కాన వారికి పరిపాలనా పద్ధతులు నేర్పి వారిని మనయంతవారుగా తయారుచేయుట మనధర్మము.

(సీ స ము)

భారతదేశవాసులకు పాలనపద్ధతు లన్ని నేర్పుటే
కోరికయొకట నేటివరకున్ మనశక్తులు ధారపోసియు
న్నారము, వారు; ఐక్యతయు, నాగరకత్వము, రాజ్యతంత్రముః
నేరిచినంతనే మనకు నిక్కపు "బాధ్యత" వీడిపోయెడుః

క్రిప్స్—ఇవి "బి. సి."నాటి ముక్కుపల్కులు. ఆ మహోన్నత భారత జాతికి మనము పరిపాలన నేర్పుటయా! బాగు. బాగు. మన మెక్కడ నేర్చుకొంటిమి? మనకు పూర్వము ఇండియాను ఎవరు

పాలించిరి ? ఇవి చరిత్ర నెఱుగని వివేకరహితమైన విషపు వాక్కులు. ఏది ఎట్లైనను సురాజ్యముకంటె స్వరాజ్యము వేయిరెట్లు మేలను సిద్ధాంతము ప్రతివారును ఒప్పుకొనవలెనుగదా! ఈ సాకులన్ని కట్టిపెట్టి వెంటనే నేనుచెప్పినవిధముగా ప్రకటింపుడు. లేకున్న మన సామ్రాజ్యమునకే ఘోరవిపత్తు సంభవించును. ఒకవైపున "హింసా సమరయోధుడగు హిట్లర్"ను మరియొకవైపున "అహింసా సమరవీరుడగు మహాత్ముడు"ను విజృంభించి వీరవిహారమొనర్చి మన సామ్రాజ్యమును, అధికారమును మట్టిపాలొనర్చెదరు. మనకు ప్రపంచప్రజల భౌతిక సహాయము, నైతికసహాయము పూజ్యమగును. మనము సర్వశూన్యులమై నమసిపోయెదము. ఇది నా హెచ్చరిక. ఇకపైని మీ చిత్తము.

జట్లం——నీ అభిశాపములు, పరుషోక్తులు మా ధైర్యమును రవ్వంతయైనను చెక్కుచెదరనీయవు. మనసామ్రాజ్యము సుస్థిరమని నమ్ముము. నీవిట్లేల పలుకుచుంటివో నేను మొదటనే గ్రహించితిని. నీకు నిజముగా ఇండియాపైఅభిమానము, గౌరవముసున్న. నీ అభిప్రాయము తెలుపుటవఱకే నీ బాధ్యత. వేరుప్రసంగములతో నీకు నిమిత్తము లేదు.

క్రిప్సు——ఒకపక్షమువారికి ఊతకోలలుగా పనిచేయుట నాకు సమ్మతము గాదు. సామ్రాజతత్వము, పెట్టుబడిదారీవిధానము, ప్రజాపీడన ప్రపంచములో అంతరించురోజులు సమీపించిన వని మాత్రము గుర్తుంచుకొనుడు. కాలము సమీపించినపుడు మహామహులకు సైతము పిదపబుద్ధులు జనించుచుండును. పరాయిదేశముపై మనపెత్తనమేల ? ఎవరిహద్దులలో వారున్నచో యీ మాయ యుద్ధములు, మారణహోమములు ఏల సంభవించును ? మీ అధికారవర్గమును ధిక్కరించు బలము మా పక్షమునకు లేదు. కాన మాతో మీరు ఆలోచించి పరాయిదేశపు భవిష్యత్తు

నిర్ణయించుట అసంభవము. ఇక పైని మీ చిత్తమువచ్చినట్లు తీర్మానించుకొనుడు.

(అని వెళ్ళిపోవును)

హారు—క్రిప్సుగారికి ఉద్యోగవాంఛ మెండు. ఏదోఒక పదవి లభించు వరకు ఇట్లే అలజడిచేయుచుందురు.

జట్ల—అవును. ప్రధానమంత్రిగారితో ఆలోచించి క్రిప్సుగారిని నేడే శాంతింపజేసెదను. ఇక ఇప్పటి మనకర్తవ్యముమాట!

హారు—మనపూర్వులు అనుసరించిన భేదోపాయమే మనకు శరణ్యము. ఇండియలో పరిస్థితి, వాతావరణము మన యీ అమూల్య సాధనకు అనుకూలముగా నున్నవి.

జట్లం—నిజమే. కాని, భారతకాంగ్రెసువారు మనలను ఊరక వదలునట్లులేదు. ఏదో ఒక ఉద్యమము లేవనెత్తి ఊదరపెట్టెదరు.

హారు—మన మారణయంత్రములే అన్నిపనులను చక్కబెట్టగలవు.

జట్లం—అట్లైన ప్రస్తుత కర్తవ్యము—?

హారు—ఇండియాలోనున్న అన్నిపక్షముల నాయకులను పిలిపించి వైస్రాయి తన చాకచక్యముచూపి రాజీ ప్రసంగములు జరిపి తగినంత కాలయాపన చేయుట ముఖ్యము. అవసరము. ఇండియాలో అనుయాయులు ఆదర్శములులేని నాయకులు, పక్షములు కుప్పతెప్పలుగా నున్నవి. లేకున్న తక్షణమే క్రొత్తవి సృష్టింపవలెను. కొందరికి మతపిచ్చి. మరికొందరికి అధికార కాంక్ష, ఇకకొందరికి స్వార్థపరత మెండుగా అచ్చట కలదు. ఇట్టివ్యక్తులు ఇండియాలో సులభముగా లభించెదరు. ఇక కాంగ్రెసువారిదే గడ్డుసమస్య. వారు దేనికిని లొంగరు. మనము ఇండియా వీడినదాక వారు ఊరుకొనరు. అయినను వారినడక అంతదూకుడుకాదు. కొంత మాంద్యము వారిని ఆవరించి యున్నది. ఆ మాంద్యమును వారు "శాంతము, ఓర్పు" అను అమూల్యపదములతో పిలచుచు మురిసికొందురు. కాని,

కాంగ్రెసువారు "రాజీ" వ్యామోహములో పడి కొంతకాలము మైమరతురు. వారిదృష్టి అప్రధానవిషయములపైకి ప్రసరింప చేయుటమే ప్రస్తుత కర్తవ్యము.

జవ—నీ సిశితబుద్ధికి, నీ అమూల్యసలహాలకు కృతజ్ఞుడను. ఈ విషయము లన్నియు మనప్రధానమంత్రిగారికి విన్నవించి వారిఅనుమతితో వైస్రాయికి ఉత్తర్వులు పంపెదను. అతడు ఒక "శ్వేతపత్రము" ను కూడ ప్రకటించునట్లు చేసెదను. వెంటనే మనము ప్రధానిని కలసికొనుట ముఖ్యము.

(వెళ్ళుదురు)



## 2వ రంగం

స్థలం—క్రొత్తఢిల్లీలో ప్రభుత్వభవనం

సమయం—ఉదయం 8 గంటలు

ప్రవేశం—వైస్రాయి లిన్‌లిత్‌గో—గాంధి

(మొదట వైస్రాయి ఒక్కడే కూర్చొనియుండును. సేవకులు తగిన సన్నాహములు చేయుచుందురు. ఇంతలో గాంధిగారు వచ్చెదరు. వైస్రాయి ఎదురుగా వెళ్ళి గాంధిగారిని వెంటగొనివచ్చి ఒకకుర్చీచూపును.)

లిన్—వెల్‌కమ్ మిస్టర్ గాంధి! తమరాకకై చాలతడవు వేచియుంటిని. ఉచితాసనము సలంకరింపుడు

గాంధి—తమ సత్కారమునకు కృతజ్ఞుడను. సరియైనసమయమునకే వచ్చియుందును. కాని, దారిలో మూగిన జనసమూహము నా కారును అడ్డగించిరి. మా ప్రజలకు దర్శనచాపల్యము అధికము.

లిన్—మహాత్ముల దర్శనార్థము ఏదేశప్రజలైనను ఇట్లే మూగుచుందురు. తమరు అలసినట్లున్నారు. రుచ్యములగు మేకపాలు, తేనె, వేరుసెనగపప్పు మున్నగుపదార్థములను సిద్ధపరచితిని.

(కాలింగ్‌బెల్ మ్రోగించును)

గాంధి—వలదుమిత్రమా! ఇప్పుడే ఉపాహారము తీసికొంటిని. బ్రిటిషు వారు అతిథిసత్కార కలాపములందు పేరుకెక్కిన ప్రముఖులు.

లిన్—కాదు, భారతీయులే మాకంటె అతిథిప్రియాభిలాషులు.

గాంధి—మీ పొగడ్త మిక్కిలి కొనియాడ దగినది. ఇక మన సమావేశమునుగూర్చి అడుగవచ్చునా?

లిన్—నేటి ద్వితీయమహాసంగ్రామవార్తలను తాము శ్రద్ధగా గమనించుచుందురని తలచెదను. మాదేశము నేడు చిక్కులలో మునిగియున్నది. ఇట్టి క్లిష్టసమయమున మీ కాంగ్రెసువారు మరింత చిక్కులలో మమ్ము త్రోయుచున్నారు. యుద్ధానంతరము మీదేశస్వాతంత్ర్యమునుగూర్చి తప్పక అలోచించెదమని కాంగ్రెసు కార్యాచరణవర్గమువారికి ఇంకొకసారి మీరు చెప్పి చూచెదరుగాక అని నాకోరిక.

గాంధి—నేను నెత్తిన నోరుపెట్టుకొని చెప్పితిని. వారుఇయ్యకొనలేదు.

లిన్—"ఫెడరేషను"ను తాత్కాలికముగా రద్దుపరచితి నని వారికి మరొకసారి జ్ఞప్తియొనర్పుడు.

గాంధి—అట్లే యత్నించెదను. కాని—ఫలితము శూన్యము.

లిన్—అట్లైన మా కొకమార్గము నైన సూచింపుడు.

గాంధి—తమ సంకల్పమును నేను వినవచ్చునా?

లిన్—నా సలహాసంఘములో మీకు అనుకూలమైన వ్యక్తులను చేర్చుకొందును. ఇండియాలో జరుగు యుద్ధ కార్యనిర్వాహణ కలాపములందు సలహాసంఘ సభ్యుల సూచనలను శ్రద్ధతో గమనించెదను. యుద్ధానంతరము అధినివేశస్వాతంత్ర్యము మీకు ప్రసాదించెదము.

గాంధి—ఈ కష్టసమయములో మీకు తప్పక సహాయ మొసర్పవలెనని నాకోరిక. ఈ అభిప్రాయమును వెలిబుచ్చుచు ఒకప్రకటన

గూడ చేసియుంటిని. కాంగ్రెసు అధికారవర్గము మాత్రము సుముఖులుగా లేరు.

లిన్—వారి అంతర్య మేమి? వారి సమ్మతి బడయుటకు నేను ఎట్టి ప్రకటన చేయవలెను.

గాంధి—కాంగ్రెసువారు ఫాసిస్టు, నాజీతత్వములను నిరసించుచున్నారు. బ్రిటిషువారి "ఆర్తత్రాణపరాయణత్వమును అనగా పోలండుకు సాయపడుటను" ప్రశంసించుచున్నారు. స్వాతంత్ర్యము, ప్రజా స్వామ్యము మున్నగువానిని కాపాడుటయన్న, పాటించుటయన్న మీకు మిక్కిలి మక్కువ యని వారు గుర్తించినారు. కాని "మా ఇండియా గతి" ఏమి? అని మాత్రము మిమ్ములను ప్రశ్నించుచున్నారు. నేడే స్వాతంత్ర్యమును ప్రసాదింప మని కోరుటలేదు. మీ "చిక్కులు" తీరినపిమ్మట—

మాహన

అనిలో మీరు జయించి సంతతవిలాసానందలోలాత్ములై
మనియున్నప్పుడు "భారతీయజన నిర్మాణాత్మకంబౌ వరో
జనరాజ్యాంగవిధాన" మొప్పకొనుచున్ చట్టంబునున్ జేసి, పె
త్తనమున్ మేమె వహించునట్లుగను వాగ్దానంబు కావింపుడీ!

ఈ వాగ్దానము ప్రస్తుతము ప్రభుత్వఅధికారప్రకటన రూప మునసుండి, సంగ్రామానంతరమున మాత్రమే అమలుజరుపుచు ప్రస్తుతము కేంద్రప్రభుత్వములో నిజమైన అధికారబాధ్యతలు కావలె నని వారికోరిక.

లిన్—కృతజ్ఞుఁను. ఈ వివరములు ఇండియామంత్రికి నివేదించెదను. కాంగ్రెసు, లీగున కున్న భేదములను మీరు వెంటనే పరిష్క రించు కొనవలెను.

గాంధి—మా "గృహకల్లోలములు" మీరుచేయు ప్రకటనకు అడ్డు రావు. "ముస్లింలీగు"తో ఇంకొకసారి రాజీకి యత్నించెదము. ఐనను లీగు భారతముస్లిముల కందరకు ప్రాతినిధ్యమువహించుట

లేదు. లీగులో చేరని జమయుత్ - ఉల్ - ఉలేమా; మోమిన్; జాతీయ ముస్లింసంస్థ, ఖాక్సార్, అహ్రార్ సంస్థలు, ఖుదై ఖద్మత్ గార్ మున్నగు ముస్లిం స్వతంత్రసంస్థలు చాలకలవు. లీగునందున్న సంఖ్యకంటె ఈసంస్థలలోనున్న ముస్లిములే చాల రెట్లుకలరు. వారు ముందు స్వాతంత్ర్యము, తరువాత మతము అనువారు. లీగువారు అట్లుగాక ముందుమతము, పిమ్మట స్వాతంత్ర్యము అను సిద్ధాంతమునకు కట్టుబడియున్నారు. ఇవి అన్నియు గృహకల్లోలములు. రాచకీయములతో వీటికి సంబంధము లేదు. ఐనను, తమకోర్కెలను కాంగ్రెస్ వారితో నివేదించెదను. ఇక సెలవు.

లిన్—చిత్తము. అని (గాంధిగారిని సాగనంపును.)

(జిన్నా ప్రవేశించును)

లిన్—డియర్ మిస్టర్ జిన్నా! ఈ ప్రత్యేకపీఠము. నలంకరింపుడు. ఈ సంకటసమయమున మీలీగువారు మా ప్రభుత్వమునకు ఎట్లు తోడ్పడెదరు!

జిన్నా—మా ముస్లింలీగు మీకు సంపూర్ణసహకారము చేయును. కాని, కాంగ్రెసు హిందూసంస్థ. వారి పరిపాలనలో మాకు చాల అన్యాయములు, అక్రమములు జరిగినవి. అట్టి చర్యలు ఇకముందు జరుగకుండునట్లును, నేటి వారి రాష్ట్రపరిపాలనలో జరిగిన అక్రమములను విచారణకమిటీద్వారా విచారించునట్లును తమ చల్లనిప్రభుత్వము మాకు హామీ నొసంగవలెను. "రాయల్ కమీషన్" నియమించి కాంగ్రెసువారి దుండగములను విచారింపవలెను.

లిన్—ఇండియా స్వాతంత్ర్యమునుగూర్చి మీఅభిప్రాయమేమి? మత విషయ మట్లుంచుడు.

జిన్నా—ఇండియాలో మతములను, రాజకీయములను విభజించుటకు వీలు లేదు. ఇండియా ఒక దేశము కాదు. ఒక పెద్దఖండము. ఇచ్చట

అనాదినుండి వేర్వేరు ప్రాచీనజాతులు కలవు. ఈజాతులు బద్ధ విరోధములతో ఇచ్చట నివసించు చున్నవి. అట్టిచో యీఖండ మును "పాకిస్థాన్, హిందూస్థాన్" అను రెండు దేశములుగా విభజించి యెవరిస్వాతంత్ర్యమును వారు కాపాడుకొనునట్లు చేయ వలెను. ఇచ్చట ప్రజాస్వామ్యము పనికిరాదు. స్వయంనిర్ణయ సూత్రము అమలుజరుపవలెను. మాకు అయిష్టముగా మీరు హిందూ కాంగ్రెసునకు స్వరాజ్యమివ్వకూడదు. మాలీగుసమ్మతి లేనిది మీరెట్టి రాజ్యాంగపద్ధతిని ఆమోదింపరాదు. కాంగ్రెస్ వారితో ఏరూపమునను, యెట్టి ఒడంబడికలు మీరు చేసికొన రాదు. అల్పసంఖ్యాకవర్గముగానున్న మాపై కనికరముంచుడు.

లిన్—అట్లైన "పాలస్తీనా" రాజ్యమునుగూర్చి మీ ఉద్దేశమేమి?

జిన్నా—ఆదేశమును విభజింపకూడదు. అది అరబ్బుల దేశము. యూదులకు అచ్చట హక్కులేదు.

లిన్—హిందువులు యీదేశము తమదే యనుచున్నారు. "హిందూ దేశము" అను పేరే వారి హక్కును చాటుచున్నదిగదా! ముస్లిముల కిచ్చట హక్కులేదని చెప్పుచున్నారు.

జిన్నా—ఒకప్పుడు ఈదేశమును మాజాతి పరిపాలించినసంగతి మీకు జ్ఞప్తిచేయుచున్నాను.

లిన్—ఐనచో ఒకవేళ మేము యీదేశమును వదలి వెళ్ళినను ఎప్పు డైనను తిరిగివచ్చి ఈదేశములో మాహక్కును కోరవచ్చునా?

జిన్నా—మీరు ఇచ్చటి స్థిరనివాసులుగారు. మేము విదేశీయులమైనను ఇచ్చటనే నివాసమేర్పరచుకొంటిమి. ఇట్టిచర్చకు అంతులేదు. మాలీగు మీకు తప్పక తోడ్పడును. మీరు ఈదేశమును ఎన్నటికిని విడువవలదు. మీసైన్యములు ఇచ్చటనేయుండి శాంతిభద్రతలు కాపాడుచుండవలెను. ఈఖండమును విభజించి మాభాగము మాకు పంచియిచ్చిన పిమ్మట మీరు వెళ్ళినను

మాకు అభ్యంతరము లేదు. మా పాకిస్థానములో మీకు వ్యాపార సౌకర్యములు చేకూర్చెదను.

లిన్—అట్లైన సిక్కులు, పార్శీలుమున్నగు ఇతర అల్పసంఖ్యాకవర్గములుకూడ మీవలె దేశమును విభజింప మనినచో దేశము బలహీనమైపోదా? విదేశీయులకు ఆక్రమణ సులభము కాదా?

జిన్నా—ఇది విశాలదేశము. కోరినవారికి వారి వారి "స్థానము" లిచ్చినను ఒక్కొక్కభాగము యూరపియన్ రాజ్యములకంటె ఎన్నోరెట్లు పెద్దదిగా నుండును. కాన మీ అభిప్రాయము సరికాదు. ఇక సెలవు. (జిన్నా నిష్క్రమించును)

(నెహ్రూ-పటేలు-రాజేంద్రప్రసాద్-బోసు ప్రవేశింతురు. వారివారి నిర్దిష్ట పీఠములపై కూర్చొందురు.)

లిన్—కాంగ్రెస్ అధ్యక్షా! తమ అభిప్రాయ మేమి?

రాజేం—మావర్కింగుకమిటీవారు ఒక తీర్మానముచేసి ఇండియామంత్రి గారి జవాబు వచ్చిన పిమ్మటగాని నేను ఏ విషయము చర్చింప రాదు.

లిన—యుద్ధోపసంఘాధ్యక్షా! తమ నిశ్చయ మేమి?

నెహ్రూ—బ్రిటిషువారి యుద్ధాశయము లెవ్వియో తెలిసికొనినపిమ్మట నా నిశ్చయమును వెలిబుచ్చెదను.

లిన్—డియర్ మిస్టర్ పటేల్! మీరు కాంగ్రెస్ పార్లమెంటరీబోర్డు అధ్యక్షులై కాంగ్రెసు రాష్ట్రములలో చక్కని పరిపాలనను కడు సమర్థతతో నిర్వహించుచుంటిరి. మీ కార్యదక్షత ప్రశంసనీయము. ఇప్పటి యుద్ధవిషయములో తమ సహాయమును కోరు చున్నాను.

పటే—మీరు మా కాంగ్రెసునాయకులతో వేరువేరుగా సంప్రతింప నక్కరలేదు. అందరు ఏకాభిప్రాయమును, ఒకే ఆశయమును కలిగియుందురు. బ్రిటిషువారి నిశ్చయమును తెలిసికొనినపిమ్మట గాని మా అభిప్రాయములను, నిర్ణయములను వెల్లడింపజాలము. (ఇంతలో బోసుబాబు వచ్చును.)

లిన్—డియర్ మిస్టర్ బోస్! వెల్‌కం కామ్రేడ్. టేక్ యువర్ సీట్ ప్లీజ్.

బోసు—వందనములు.

లిన్—తమపక్షమువారి సహాయమును ఈక్లిష్టసమయమున అర్థించు చున్నాము.

బోసు—బ్రిటిషువారి నిశ్చయమును నేను తెలిసికొంటిని. మీప్రకటనల కొఱకు మాపక్షమువారు ఎదురుచూడవలసిన పనిలేదు. అయి నను మీకు తుది అవకాశమిచ్చుట మంచిది. కాన ఇండియా స్వాతంత్ర్యదేశముగా వెంటనే మీరు ప్రకటించి మాసహా యము కోరుడని మీకు తెల్పుచున్నాను. లేనిచో మా "ఫార్వర్డ్‌బ్లాక్" పక్షమువారు తప్పక సత్యాగ్రహసమరమును ప్రారంభించెదరు. అదిగాక ఇట్టి రాయబారములు ఇంతకుమున్ను ఎన్నిసారులో జరిపియుంటిరి. కాలయాపన తప్ప యీ సమా వేశములవలన ఫలితము శూన్యము. మీపిలుపు నిరాకరించుట ధర్మముకాదు కాన నేడిటకు వచ్చితిని. నిష్ఠురమైనను నిజము వచింపవలెను. అదిగాక నేను ఎప్పుడును సత్యమునే ప్రేమింతును.

(ఆనంద భైరవి)

పెద్దలు పిల్వనంప కడుపెంకితనమ్మును కూడదంచు మీ
యొద్దకు వచ్చినాడ మదినున్నది యున్నటు లేనుచెప్పెదన్
సుద్దులుచెప్పి మీరు మము శూన్యముగా చనుమందురయ్య; ఈ
రద్ది యిటేల? తోడ్పడగ రాము స్వరాజ్యము మాకులేనిచో!

లిన్—మిత్రులారా! నాఆహ్వానమును మన్నించి మీరిటకువచ్చి మీ మీ అభిప్రాయములు నిష్కపటముగా వెల్లడించినందులకు కృతజ్ఞతాపూర్వక వందనములు. కాని భారతనాయకులందరు ఏకీభావమును ప్రకటింపనందులకు చింతిల్లుచున్నాను.

నెహ్రూ—మీరు పొడపడుచున్నారు. ఒక జిన్నాగారుతప్ప అందర మును ఏకాభిప్రాయబద్ధులమై యున్నామని మీకు మరియొకసారి

తెలుపుచున్నాను. తమకు భిన్నముగా కన్పించిన అది మా దురదృష్టము.

పటే—మీరు పాలకులు. మేము పాలితులము. మా అభిప్రాయములు మీకొక్క లెక్కలోనివి కావని మాకుగట్టినమ్మకము. అదిగాక మేమందరము ఐక్యముగానుండుటకూడ మీకుఅయిష్టమని నేడు వెల్లడిచేసితిరి. ఐక్యభావమును మేము మీ సమ్ముఖమున నేడు వెల్లడించినను ఏ జిన్నాఅభిప్రాయభేదమునో సాకుచేసికొని మా అనైక్యతను నిరూపించితిరి. మెజారిటీసిద్ధాంతమునుండి మీరు తొలగిపోకూడదని విన్నవించుచు సెలవు తీసుకొనుచున్నాను—

లిన్—మీ అభిప్రాయములు తెలిసికొనుటకై నేను అట్లంటినిగాని సత్యముగా మీ ఐక్యతను నేను గుర్తించితిని. నన్నుగూర్చి మీరు వేరేవిధముగా మనస్సులలో చిత్రించుకొనకుడు. మీకు శ్రమయిచ్చినందులకు పశ్చాత్తాపము వెలిబుచ్చుచున్నాను. గుడ్ బై ఫ్రెండ్స్.

సప్రూ—మీరు నిజమును వెల్లడించినందులకు కృతజ్ఞులము. సెలవు

(తెరపడును.)

(మూడవ అంకము సమాప్తి.)



# నాల్గవ అంకము



## 1వ రంగం

స్థలం—అలహాబాదులో ఆనందభవనము

సమయం—మధ్యాహ్నం 2 గంటలు

ప్రవేశం—గాంధి-పటేలు-నెహ్రూ-రాజేంద్రుడు-అజద్-బోసు

గాంధి—మిత్రులారా! వైస్రాయి ప్రకటించిన “శ్వేతపత్రము” ను చూచితిరికదా! ఎన్నరాని ఆశాభంగము! అన్నమడిగిన సున్నపు ముద్దలు!

బోసు—ఇక్లే ఎల్లప్పుడును ఆశాభంగములు కలుగజేసి క్రొత్తఆశలను రేకెత్తించు చుందురు. ఇదియే బ్రిటిషర్ల రాజనీతి చాతుర్యము. నిజముగా అది తెల్లనికాగితమే.

పటే—బ్రిటిషు సామ్రాజ్యతత్వము మనకు క్రొత్తగాదు. తెల్లని కాగితముపై తెల్లసిరాతో వ్రాసిన శశవిషాణము మాత్రము ఆ “శ్వేత పత్రమందు” కలదు.

నెహ్రూ—అచ్చటచ్చట నల్లనిసిరాచుక్కలుకూడ కలవు. అవిహిందూ ముస్లింతగాదాల చిహ్నములు. తెల్లనేత్రములకు ఆ “చుక్కలు” దయ్యపుకంటికి వెలగింజవలె కొండంతమచ్చలుగా కన్పించును,

అజా—ఈ శ్వేతపత్రములో తెల్లవాని హృదయము స్పష్టముగా కన్పించుచున్నది. “వార్ క్యాబినెట్” కు ఇదియు వ్రాతపటక.

రాజేం—ఇది సామాన్యమైన ప్రకటనకాదు. “వైట్ హాల్ ఫ్యాక్టరీ” లో సరిక్రొత్తగా తయారైన మాయదారిబిస్కట్టు. వైస్రాయివర్తకుని

ద్వారా లండనునుండి ఇండియాకు ఎగుమతిచేసిరి. తినుటకై విఱిచిచూడగా తవుడు, తెల్లనిపురుగులు మాత్రముకన్పించినవి

గాంధి—అది బిస్కట్టుకాదు. ఒకచట్టుబండ. వైస్రాయి యింతకు క్రితము "రాజీ రాయబారముల"పేర 53 గ్గురు ఇండియా నాయకుల సమావేశపఱచి కులాసాగా ఆడిన యేబదిమూడు గోలీలగుర్తులు గల "శ్వేతపాషాణము"గా నాకు కన్పించుచున్నది. రొట్టెకై నేను యాచింపగా ఆ బండ నానెత్తిన పడవేసిరి.

బోసు—మహాత్ములుగూడ పొరపడుచుందురని నేడు విశదమైనది. బ్రిటిషువారి "హృదయపర్వతమును" త్రవ్వి "శ్వేతపత్ర"మను తెల్లటి చుంచుయెలుకను మహాత్ముడు పట్టుకొనెను.

రాజేం—ఒక్క మహాత్ముడే పొరపడుటయేమి? రాజీ ప్రసంగములకు అందరము వెళ్ళి ఆశాభంగముతో తిరిగివచ్చినవారమే. అదిగాక మహాత్ముడు నిరంతరము "ఆశావాది". నిరాశ ఆయన నిఘంటువునందు కన్పింపదు.

గాంధి—నేను మహాత్ముడను కాదు. మానవమాత్రుడను. నిజముగా బోసుగారు చెప్పినట్లు పొరపడితిని.

( కమాచి )

వైస్రాయికబురంప ఆశలుచిగురింప విసువక పలుమార్లు వెళ్ళినాడ
పోరులో సాయమ్ము పొనరించుడనిచెప్పి దేశీయులకు బోధ చేసినాడ
కదనంబుముగిసిన గడియలోనె స్వరాజ్య మిచ్చివేయుదురంచు నెంచినాడ
స్వాతంత్ర్యసమరంబు సాగింతుమనియాగు యువకులయుత్సాహ
మూడ్చినాడ

కడకు "శ్వేత పత్రమ్ము"ను గాంచినాడ
ఆశలన్నియు శూన్యమై అణగిపోయె
అన్నమడిగిన నోటికి సున్నమిడిరి
సాయపడవద్దు యుద్ధపిశాచమునకు.

ఐనను, రాజీసాధనములు మాత్రము మనము విడువజాలము. అపజయపరంపరలను విజయసాధనములుగా నెంచెదము. కాంగ్రెసు కవాటము రాజీప్రసంగములకై ఎల్లరకును నిరంతరము తెఱచియే యుండును.

బోసు—ప్రపంచ సంగ్రామము రాకముందే నేనుచెప్పినట్లు శాంతిసమర ప్రారంభమునకై బ్రిటిషువారికి "అల్టిమేటము" పంపినచో ఎంత బాగుండెడిది? వారి ఆశయములు తేటతెల్లముగా శ్వేతపత్రము వెల్లడించినది. ఒత్తిడిచేసినగాని వారు అధికారము వదలుకొనరు. సామ్రాజ్యతత్వము, కాపిటలిజము, నాజీతత్వము, ఫాసిస్టుతత్వము అన్నియు ఒక తల్లిబిడ్డలే.

( మ ధ్య మా వ తి )

నచ్చులు కూడవింక మననం బొనరించుట మానుడయ్యా, వా
రిచ్చున దేమి లేదనుచు నింతకుమున్నిటు లెన్నిసారులో
రచ్చలుచేసి చెప్పితిని, రాజ్యమునిత్తురె తీపిమాటలన్
జొచ్చుకపోయి చేయవలె శూరులవోలెను శాంతియుద్ధమున్.

పటే—వారు అధికారమును విడనాడెదరని కలలోనైన అనుకొనలేదు. వారికి కడపటిలవకాశము యిచ్చిచూచితిమి. వారు వివేకశూన్యులై ఆ సదవకాశమును కోల్పోయిరి. ఇదివరకే రాష్ట్రస్వరాజ్యము ఇచ్చిరట! ఇక కేంద్రములో బాధ్యతకూడ ఒప్పజెప్పదలచిరట! మనము వద్దని గోల పెట్టుచుంటిమట! ఇంతలో యుద్ధము తటస్థించెనట! అంతటితో అన్నిసమస్యలు యుద్ధానంతరమునకు వాయిదా వేయబడినవట! ఈలోగా భారతీయులు తమలో నున్న "సాంఘికవిభేదములు" సర్దుబాటు చేసికొనుచు యుద్ధకృషికి హృదయపూర్వకసహాయముచేయవలెనట! ఇట్టితీపిమాటలతో పొదిగిన చేదుమాత్రలను మ్రింగునట్లు బలవంతపెట్టజూచిరి. రాజీప్రసంగముతో యుద్ధకాలమును గడుపజూచిరి. ఇట్టిమోసము ఇంకెంతకాలము సాగును?

(మాండ్)

గట్టిగ కాదుపొమ్మనిన కాళ్ళపయిన్‌బడి వేడినాము ? ఈ
వట్టి చిదంబరాత్మకవివాదప్రదోత్సుకరాయబారముల్
పెట్టుటయేల ? భేదములు పెంచుచు మీకును మీకు నేడికన్
గిట్టగలేదు పొమ్మనుచు గీటులు పెట్టగనేల పాలకుల్

జవ — వారట్లేలచేయుదురు ? మోసపోయెడివారున్నపుడు మోసము చేయువారుండుటదోసమా? ధర్మాధర్మములమాట అటుంచుడు. నేడు దేశమున నిరుద్యోగము, నిరుపేదతనము ప్రబలినవి. బ్రిటిషు వారి 170 యేండ్ల పరిపాలనమునందుకూడ దేశము అజ్ఞానము, అవిద్య, అనారోగ్యములతో నిండియున్నప్పుడు ఇక మనదేశమును వారు బాగుపఱచుట యెన్నడు? యుద్ధానంతరము ఇంకొక "రౌండుటేబిల్ సమావేశము" జరిపెదరట. ఇట్లే రౌండు టేబిలులు, రాజీలు, రాయబారములు జరుపుచు రోజులు వెళ్ళబుచ్చుకొని మనల మరింత రొంపిలో త్రోసెదరు. వారు చేసిన మోసములు తలచుకొనుటయుందే మన అమూల్య సమయమంతయు వ్యర్థపుచ్చుచుంటిమి. ఇది మన అజ్ఞానమును, అలసత్వమును వెల్లడిచేయుచున్నది.

( కేదారగౌళ )

తలపగనేల మోసములు తజ్ఞాలు మీరలు మాటిమాటికిన్
విలువయొసంగి వారి అవివేకపుచర్యలనెల్ల గొప్పగా
పలుకుటయేల? ముందు మన భావిపరిస్థితి యూహచేసి, ఈ
తలపులు కట్టిపెట్టి మనదారి "అటో, యిటో" తేల్చు డింతటన్.

అజ — అవును. వారు స్వాతంత్ర్యము చేజేతుల యిత్తురనుట కల్ల. వారి స్వజాతివారును, ఇరుగుపొరుగు దేశమువారును అగు ఐర్లండు వారికే స్వాతంత్ర్య మిచ్చుటకు నిరాకరించి "తన్ని పుచ్చుకొను వఱకు తనువులు తెలియక కారాదు" జాతియగు వీరు ఇక "మే, మే" యను మనమాట లెక్కగొనెదరా ?

(పాదసామక్రియ)

మించినదేమి లేదిపుడు మేలు తలంచిరొ వారికంతముల్
త్రుంచుకపోవుకాలమున తోడ్పడబోవగ త్రోసివేసి మా
పంచకు చేరవద్దనుచు పల్కిరికావున ద్రోహ మేరిదో
యెంచుడు మీద చేయగలకృత్యము యోచనసేయు డింతటన్.

రాజేం—క్రిందటి ఐరోపా మహాసంగ్రామమునందును ఇక్లే తెగినదాక బిగించి, "ఐర్లండు"ను పోగొట్టుకొనిరి. నేటి యుద్ధమున తప్పక మన ఇండియా పోగొట్టుకొందురు.

బోసు—ఈ పిల్లిశాపనార్థములకు బ్రిటిషువారి ఇనుపకట్లు తెగిపోవు. వెంటనే కర్తవ్యమును నిర్ణయింపుడు.

పటే—బ్రిటిషువారి యుద్ధాశయములకు అసమ్మతి సూచకముగా యెనిమిది రాష్ట్రములలో నున్న కాంగ్రెసు మంత్రులు, కార్యదర్శులు వెంటనే రాజీనామాలు ఇచ్చి ప్రతిష్టంభన చేకూర్చవలెనని తీర్మానించెదము.

బోసు—సర్దారునకు జోహారులు. ఎట్టి శుభవార్తవింటిని! కాని—

నెహ్రూ—"ఈ యుద్ధమునందు కాంగ్రెసువారు యుద్ధకృషికి యెట్టి సహాయము చేయరు! సామ్రాజ్యతత్వమును వ్యాపింపచేయుటకే బ్రిటిషుప్రభుత్వమువారు యుద్ధములో పాల్గొనిరని ధృవపడినది" అని ఇంకొక తీర్మానముగూడ చేయవలెను.

అజ—బ్రిటిషుప్రభుత్వమువారు ఇండియాలో అనుసరించుచున్న "విభజించిపాలించు" పద్ధతిని ఏకగ్రీవముగా నిరసించుచు భారత జాతీయమహాసభవారు అనతికాలములో స్వాతంత్ర్యసమరమును సాగింపబోవుచున్నారు. దేశప్రజలందరు సమరసన్నాహములలోనుండి కాంగ్రెసుఆదేశమునకు ఎదురుచూడవలెను"అని మరొకతీర్మానముచేయుట ముఖ్యము.

బోసు—ఈతీర్మానములో "ఇన్నినెలలలో సమరము సాగింపనున్నా"మని కాలనిర్ణయము ముఖ్యము.

రాజేం.—మంత్రులు రాజీనామాలు ఇచ్చుటకు ముందు నేటి జర్మనీ యుద్ధము ప్రకటించినప్పటినుండి యీరోజువరకు కాంగ్రెసు కార్యసంఘమువారు చేసిన మొత్తము తీర్మానముల సారాంశమును రాష్ట్రీఅసెంబ్లీలలో ప్రవేశపెట్టి ఆమోదింపజేయుటకు రాష్ట్రప్రధానులు కోరబడుచున్నారు” అని ఇంకొకతీర్మానము.

గాంధి.—“ఈద్వితీయ మహాసంగ్రామమునందు బ్రిటిషుప్రభుత్వమునకు భారతకాంగ్రెసువారు నైతికసహాయము చేయరు. భారతదేశము తటస్థముగా నుండును” అని వేరొక తీర్మానము.

నెహ్రూ.—“భారతజాతీయ మహాసభవారుకోరిన ప్రజాపరిషత్తును సమకూర్చి భారతజాతిఅంతయుకలసి నిర్మించు రాజ్యాంగప్రణాళికను బ్రిటిషుపార్లమెంటువారు అంగీకరించి, చట్టముచేసి భారతదేశమునందు అమలుజరుపవలెను”—అని ఇంకొకటి.

బోసు.—ప్రజాపరిషత్తు సమస్య స్వాతంత్ర్యసమరము ముగిసినపిమ్మట, భారతజాతి స్వతంత్రమైన అనంతరము చూచుకొనవలెను. కాని ప్రస్తుతముకూడదు. “రెండునెలలలో ఇండియాకు స్వాతంత్ర్య వాగ్దానము చేయనిచో కాంగ్రెసుసంస్థ శాంతిసమరమును తప్పక సాగింపవలసివచ్చును” అని విపులముగా ఒకతీర్మానము ఉండుట అవసరము.

రాజేం.—ప్రస్తుతపరిస్థితులలో బోసుగారి తీర్మానమును అంగీకరింపజాలనందుకు చింతిల్లుచున్నాను.

బోసు.—మీరిట్లే ప్రతిసారియు దేశమును మోసపుచ్చుచున్నారు. బ్రిటిషువారు మిమ్ములను మోసపుచ్చి భ్రమపెట్టుచున్నారు. భారతప్రజానీకము కాంగ్రెసువారి త్యాగనిరతికి విభ్రమము చెంది కాంగ్రెసుపై కొండంత ఆశపెట్టుకొనియున్నది. స్వాతంత్ర్య సమరమునకు దేశము సిద్ధమైయున్నది. దేశీయులందరు విప్లవశక్తిని ఆహ్వానించుచున్నారు. వారిలో నూత్నజాగృతి, నవ్య చైతన్యము, స్వాతంత్ర్యపిపాస, తొణుకుచు వెల్లువలై పారాడు

చున్నది. ఇట్టితరి విప్లవజ్యోతి ఆర్పి, ఉత్సాహమును చంపి, దేశమును తాబేటినడకలతో నడుపుచుండుట కాంగ్రెసు పెద్దలకు తగినదికాదు. చరిత్రననుగమనించినచో తీవ్ర స్వాతంత్ర్యసమరము నడుపనిది ఏదేశమును స్వేచ్ఛపొందలేదు. మిమ్ము ధిక్కరించి నేను తప్పక క్రొత్తపంథాతో దేశములో చైతన్యము ఊలగా కొని దేశమాత శానిసశృంఖలములను అచిరకాలములో తుత్తునియలు చేసెదను. (వెళ్ళిపోవును.)

రాజేం—బోసుగారిని తృప్తిపరచుట కష్టము. కడుంగడు తీవ్రవాది. బ్రిటిషువారి సామ్రాజ్యతత్వం త్రాడు నేడే త్రెంపవలెనని క్షణక్షణము ఉద్రిక్తుడగును. కాలపరిపక్వమునకై అప్రమత్తులమై మనము వేచియుందుము. తగిన సన్నాహములతో మాత్రమే వేచియుందుము. ఈ తేడాను ఆతడు గమనింపడు.

పటే—పోనీ! ఆ యువకుని శక్తిని మనమేల అరికట్టవలెను? కర్తవ్యపరాయణులై ఇక సభయందు ఆమోదించిన తీర్మానములను మీరు ఇండియామంత్రికి పంపుడు. నేను రాష్ట్రమంత్రులకు ఉత్తర్వుల నిచ్చెదను.

గాంధి—స్వాతంత్ర్య సమరమునకు దేశీయులు సన్నద్ధులై యుండునట్లు దేశములో సత్వర ప్రబోధ, ప్రచారములు జరుగవలెను. రాష్ట్రమంత్రులు తప్పక రాజీనామా లిచ్చెదరని తలచెదను.

అజ—"తాంబే" వంటి దేశద్రోహులు మనదేశమున మచ్చునకైన లేరు. రాష్ట్రమంత్రులందరు త్యాగమూర్తులే. తప్పక అధికార పదవులను కాలతన్నెదరు. రాజకీయ ప్రతిష్టంభన తథ్యము.

రాజేం—ఇక సమావేశమును ముగించితిని. కార్యకర్తలు కర్తవ్యపరాయణులై మెలంగ గోరుచున్నాను.

(తెరపడును)



## 2 వ రంగం

స్థలం—మద్రాసులో అసెంబ్లీభవనం
సమయం—మధ్యాహ్నం 11 గంటలు
ప్రవేశం—ఎరిస్కిన్ ప్రభువు, ప్రధాని రాజగోపాలాచారి, రెవిన్యూమంత్రి టి. ప్రకాశంపంతులు

ఎ—మంత్రిసత్తములారా! ఇటు దయచేయుడు.

రాజ—వందనములు.

ప్రకా—మీసత్కారమునకు కృతజ్ఞుడను. మాకు అత్యవసరకార్యాంతరములు కలవు. కాన త్వరలో మనసమావేశము ముగింపగోరుచున్నాను.

ఎరి—ఆశ్చర్యము! ఎంతలో ఎట్టిమార్పు! ప్రకాశంగారు అక్కరతీరినవిధానముగా మాట్లాడుచున్నారు. మీకును మాకునుగల అధికారబాంధవ్యము నేటితో అంతమొందుచున్నను స్నేహానంబంధము అటే నిలచియుండునని ప్రకాశంగారు గమనింతురుగాక.

ప్రకా—మంత్రిత్వములకుమాత్రమే రాజీనామాలు పెట్టుటకు వచ్చియుంటిమి కాని మిత్రత్వములకు కాదు. మీరుకూడ రాజీనామాలు పెట్టవలసినస్థితి ఎప్పటికైన రావచ్చును. మాదేశములో మాకు ఒకపరాయిదేశపు ప్రభువు ఉద్యోగపదవుల నిచ్చి మా కోశమునుండి జీవనభృతులనిచ్చుట, మా సమ్మతిలేని చర్యలు జరుపుట మా ఆత్మగౌరవమునకు భంగకరము. నేటి ప్రభుత్వచర్యలకు మా అసమ్మతిని సూచించుటకే ఈ రాజీనామాలు.

రాజ—మేము వెంటనే పార్టీ కార్యవర్గ సమావేశమునకు హాజరు కావలెను. ఈ రాజీనామా పత్రములు అంగీకరింపుడు. నా తరపునను, నాతోటి మంత్రుల తరపునను యీ రాజీనామాలను ప్రధానిహోదాలో దాఖలుచేయుచున్నాను. నేటికి మాకు మోక్షము కలిగినది. కాని మా దేశమోక్ష మిక ఎన్నటికో!

(నాదనామక్రియ)

రద్దిరయొనర్చి మీరిడిన "రాష్ట్ర స్వరాజ్యపు గాలిమూట" మా
కద్దరు పంచెలో పొదిపి కాపానరించితి మింతదాక మీ
యొద్దన దాచుకొంటిదిగో! ఒల్లము దీనిని "శ్వేతపత్రమే"
బ్రద్దలు చేసివైచినది బాబు సలాములు మీకు మాటికిన్

(రాజీనామాపత్రములు గవర్నరుగారు అందుకొని కాలింగ్ బెల్ మ్రోగించును. కార్యదర్శి వచ్చును.)

ఎ—ఈ పత్రములు చదివి వినిపింపవలెనని నీవు కోరబడుచున్నావు.

కార్య—చిత్తము. చిత్తము

"బ్రిటిషు ప్రభుత్వమువారు భారతదేశ పరిస్థితులను భారతీయుల హృదయవాంఛలను 170 యేండ్లపరిపాలనానంతరముకూడ గ్రహింప జాలనందులకు రాష్ట్రమంత్రులమైన మేము మిక్కిలి చింతిల్లుచున్నాము. ఇట్టిపరిస్థితిలో మేము రాష్ట్రపాలనము కొనసాగింపజాలమని తెల్పుచూ మంత్రిపదవులకు రాజీనామాల నిచ్చుచున్నాము."

(ఇట్లు చదివి కార్యదర్శి నిర్గమించును)

ఎ—రాష్ట్రపరిపాలన కొనసాగించుటకు నేను యితరవేర్పాటులు చేసికొనువరకు మీరాజీనామాల సంగీకరింపజాలను—ఈవిషయము మీకు అధికారపూర్వకముగా తెల్పుచున్నాను. ఇక స్నేహపూర్వకముగా— ఈరెండేళ్ళ పైకాలమునుండి రాష్ట్రములో మీరు కొనసాగించిన పరిపాలన చాల ప్రశంసనీయముగానున్నది. మీకు కృతజ్ఞుడను.

రా—మీకు వందనశతములు. మా పరిపాలనమునందు అడ్డురాక, మీప్రత్యేకఅధికారములను చెలాయింపక సహకార మొనర్చినందులకు ప్రత్యేకవందనములు.

ప్రకా—ఈ ప్రశంసలవల్ల మాకు ఒరుగునది ఏమియునుండదు. మాకు సంపూర్ణస్వాతంత్ర్యము, దేశమోక్షము కావలెను. ఈపవిత్ర సంకల్పములే మమ్ముల నీమంత్రిపదవీస్వీకారమునకు పురికొల్పినవి. మాసంకల్పమును మీరు భంగమొనరించినప్పుడు ఆ స్థానమునందే అంటిపెట్టుకొనియుండుట హేయము.

ఎ—మీరు పునరాలోచించుకొని అధికారములను మరల స్వీకరింపుడు. వైట్‌హాలుమీవాంఛలను యుద్ధానంతరము తప్పక నెరవేర్చును.

ప్రకా—ఇక అధికారములను స్వీకరించుట యెన్నటికిని ఇట్టి అధ్వాన్న పరిస్థితులలో జరుగనేరదు. "వైట్‌హాలు" మాకు "వైట్ హాల్" గా కన్పించుచున్నది. మేము యుద్ధకృషికి సంపూర్ణ సహకారము చేసెద మన్నను ఒక్క వాగ్దానమైనను మీవారు చేయుటకు సమ్మతింపరైరి. ఇట్టి సామ్రాజ్య తృష్ణాంధకార బంధుర పరిస్థితులలో మాకు వెలుగురేఖ యొక్కటియు కన్పించుటలేదు.

(కన్నడ)

ఎన్నాళ్ళిట్టుల ఘోరదాస్యమున మే మీ దుస్థితిన్ముగ్గి ప్రచ్ఛన్నస్వాత్ములమై కృశించెదము ? మాసామర్థ్యమున్ జూపి, మీ కన్నన్ మిన్నగ పూర్వమట్లు జనసౌఖ్యం బెంచి మారాజ్యమున్ మన్నిలట్టుల నేలుకొందు మిక మోమాటంబు పాటింతుమే ?

ఎరి—మీరు త్వరపడుచున్నారు. యుద్ధానంతరము తప్పక మీకు అధి నివేశ స్వాతంత్ర్యము లభించును.

ప్రకా—మొదటి ప్రపంచయుద్ధముతరువాత లభించిన 'స్వరాజ్యము'ను నేటివరకును మా భారతీయులు మరువలేదు. స్వరాజ్యము ఒకరు ఇచ్చునదికాదని మా దృఢనమ్మకము. మేముకోరునది బ్రిటిషువారి సద్భావముకాని, మాటలమోసము, వాగ్దానభంగములు కావు. స్వతంత్రభారతపౌరుడనై తిరిగి మిమ్ములను కలసికొనవలె నని నాకోరిక.

రాజ—"ఆంధ్రకేసరి" గర్జనలను ఇంతకుమున్ను మీరు వినియుండలేదు. అందువలన మీరు భయాకులితచిత్తులైనట్లున్నారు. స్నేహపూర్వక చర్చాప్రసంగములకు మీ అధికారహృదయమునందు తావొసంగకుందురుగాక! సెలవు.

ఎ—మిమ్ములను రాష్ట్రమంత్రులుగా చూచుటకే నాహృదయము మఱల మఱల కోరుచున్నది.

ప్రకా—అంతర్జాతీయపరిస్థితులు, భారతజాతి చైతన్యము, బ్రిటిషువారి హృదయపరివర్తనములవల్ల తిరిగి మేము రాష్ట్రమంత్రులము కావచ్చునేమో కాని ఇప్పుడుకాదు. ఇక సెలవు.

(తెరపడును)



# అయిదవ అంకం



## 1వ రంగం

స్థలం—బొంబాయిలో జిన్నా భవనం

సమయం—సాయంత్రం 3 గంటలు

ప్రవేశం—జిన్నా—అజాద్

జిన్నా—ఆయియే మౌలానా సాహబ్ జీ! పధారియే.

అజా—ఆదాబ్ అర్జ్ ! జిన్నా భాయీ !

జిన్నా—సలామ్ ఆలేకో.

అజా—ఖుదా ఆప్‌కో భలాకరేగా. క్యా జిన్నా భాయీ! ఆప్ అభీ నిశ్చయ్ నహీంకియా! ఆప్ హీంసే సారా దేశ్ బర్‌బాద్ హో జాతాహై. ఆరామ్ సె సోచ్‌లో.

జిన్నా—హాంసెక్యో? ఐసీబాత్ కభీ నహీంకర్‌నా! ఆప్ కాంగ్రెస్ లోగోంసే హీ హామారే ముల్క్‌కో ఔర్ మజ్‌హాబ్ కో ఐసీ ఆఫత్ మిలాహై. ఆప్‌తో ముస్లింనహీంహై!

అజా—క్యోనహీం! లేకిన్ పహలే మై గులామీ భారతీయ్ హూం. బాద్ ఖుదా ముస్లింహూం. మజ్‌హాబ్ కా జిక్ర్ అబ్ క్యో? కాంగ్రెస్ వాలే క్యా కసూర్ కియా హై!

జిన్నా—కాంగ్రెస్ మానీ క్యాహై! సవర్ణహిందూలోగ్ కా కమిటీ హై. హిందూ లోగ్ కా రాజ్ స్థాపన్ కర్‌నే కో వే బడా కోశిష్ కర్తేహై. ఏక్‌బార్ సోచ్‌లో భాయీ! ఆప్‌కీ ఖూన్‌కీ నాలోమే కిన్‌కె లోహూ బహ్ రహాహై! వహీ లోగ్ ఐసీ ముల్క్‌కో హామారే బాదుషహ్ పాలన్‌కియాహై. మైభీ

అంగ్రేజ్ లోగోంకా రాజ్‌కో కబూల్ నహీకర్తా. లేకిన్ హిందూ లోగ్ రాజ్ కర్నేసే మై నహీ మాన్‌తా.

అజా—నహీభాయియా! ఆప్ బడా భూల్‌మే పడ్ గయాహై. కాంగ్రెస్‌మే సబ్ మజ్‌హబ్ వాలే రహ్‌తేహై. సారాదేశ్‌కో ఛుట్‌కారా పానే కేలియే కాంగ్రెస్ కోశిష్ కర్‌తేహై. సోచ్‌లో భాయియా! కిసీ దిన్ ఆప్‌భీ కాంగ్రెస్ కా మెంబర్‌హై. ఔర్ ప్రెసిడెంట్‌భీ హువాహై. ఐసీ శఖ్స్ మజ్‌హబ్ కే పాగల్ బన్ కర్ ముల్క్‌కో తుకరాతేహై. హమారే ముల్క్ అంగ్రేజోంసే హమారే కాబూమే ఆనేపర్ హమ్ సబ్‌లోగ్ ఆజాద్ బన్‌నేపర్ తబ్ హమ్ హిందూ లోగోంసే బడే జోర్‌సే లడాయ్ శురూ కరేంగే. బడే హిస్సా హం బాంట్ లేంగే. అబ్ హాం సబ్ మజ్‌హబ్ వాలే అంగ్రేజోంకా గులామ్‌హై. ఏక్ గులామ్ ఔర్ ఏక్ గులామ్‌సే గులామీ బాంట్‌నేకో జంగ్ యా జిహాద్ కర్‌నా బేమతలబ్ ఔర్ శర్మిందాహై. సోచ్‌లోభాయియా ఫుర్‌సత్‌సే సోచ్‌లో.

(నెహ్రూ ఆగమనం)

జిన్నా—డియర్ మిస్టర్ నెహ్రూ! టేక్‌యువర్ సీట్. హార్టీ వెల్‌కమ్ టు మై డియర్ ఫ్రెండ్.

నెహ్రూ—మీ సద్భావమునకు వందనములు. కాని నేను మీ ఆతిథ్యమును కోరియే నేడిటకు వచ్చితిని.

జిన్నా—గౌరవనీయమైన అతిథికి గౌరవప్రదమైన సత్కారము జరుపబడును.

నెహ్రూ—మీసద్భావము ప్రశంసింపదగినది. నా రాక వృథా చేయరని యెంచెద.

అజా—ఇంత ఆలస్యముగా వచ్చితిరేల?

నెహ్రూ—క్రిప్స్‌గారితో మాట్లాడుచున్నందున ఒక్కింత ఆలస్యమైనది. వారు వార్ధా వెళ్ళినారు. నేను ఇటు వచ్చితిని.

జిన్నా—"ఊరకరారు మహాత్ములు" అన్నట్లు తమరాకయొక్క విశేషమును తెలిసికొన వీలుకలి కుతూహలపడుచున్నాను.

నెహ్రూ—మనలో మనకు అరిపోని వైరములున్నవనియు, ఆకారణమున మనకు స్వాతంత్ర్యము నిచ్చుటకు తాము వెనుకాడుచున్నామనియు బ్రిటిష్ప్రభుత్వమువారు పైకి ప్రకటించుచున్నారు. మూడవపార్టీకి అట్టి అవకాశ మివ్వకుండుటకే యీ నారాక.

జిన్నా—బ్రిటిషువారిని నిందింపనేల? నిజముగా మనలో భేదములు కలవు. మతము లేనాడు పుట్టినవో భేదములు ఆనాడేపుట్టినవి.

నెహ్రూ—మతములు రక్తపాతములకొరకును, తగాయిదాలకొరకును సృష్టింపబడలేదు. శాంతిసామరస్యములకోసమే మానవుని అజ్ఞానదశలో మతములు పుట్టినవి. నేటికి ఆచరణలో మతముయొక్క ఉద్దేశము పూర్తిగా నశించినది. మతము అనగా అభిప్రాయము అని అర్థము. అభిప్రాయభేదము లుండుట మానవ సహజము. కాని కేవలము అభిప్రాయభేదములకై తన్నుకొని చచ్చుట, జాతి వేఱనుట, విదేశీయులమనుట, ప్రత్యేకసౌకర్యములు, ప్రత్యేకప్రదేశములు కోరుట అమానుషచర్య. మానవలక్షణము కాదు. మానవుడు సంఘజీవి. మానవుడు అజ్ఞానదశలో సృష్టించిన యీ "మతము" అను చీకటితెరను విజ్ఞానుడైనకొలది ఆతెరను తొలగించి వెలుగులోనికివచ్చుట మానవధర్మము. మనమందరము మానవులము. ఒకేమతమునకు చెందినవారము. మనది "విశ్వమానవ మతము" సత్యము, దయ, అహింస, మానవసేవయే మన మతసిద్ధాంతములు.

జిన్నా—ఈ వేదాంతవాక్యములు, ఓదార్పుమాటలు మమ్ములను తృప్తిపరుపజాలవు. మీ కాంగ్రెస్ రాష్ట్రపరిపాలనా సమయమున కాంగ్రెస్‌పాలితరాష్ట్రములలో మా ముస్లిములను పెట్టిన హింసలు మాకు యెన్నటికిని మఱపునకు రావు.

నెహ్రూ—మీరు పొరబడుచున్నారు. మతోద్రేకము గలిగి మత

పిచ్చియే వృత్తిగాగల కొందరు యిట్టిసిలివార్తలు, వట్టిపుకారులు పుట్టించుచుందురు. అయినను ఆధారరహితమైన స్వార్థపరుల సృష్టియైన యీ అపవాదపరంపరలను మాటవరుసకు వాద సౌకర్యముకొఱకు నిజమని నమ్మినను నేడిక అట్టి చిక్కులు తొలగినవి. రాష్ట్రములలో కాంగ్రెసుమంత్రులు అధికారములను వదలుకొన్నారు. ఇక సమాధానమార్గము సూచింపుడు.

జిన్నా—మేము మీతో సమాధానపడుటయన్న మీ గొప్పతనమును ఒప్పుకొన్నట్లగును. మీ కాంగ్రెస్ సంస్థకూడ మా ముస్లింలీగు వంటి మతసంస్థయే. మేము పాలకులతోనే రాజీపడెదము.

నెహ్రూ—మనమెల్లరము సఖ్యముగా నుండుటకు మీ కట్టుపలికినను ఓర్చుకొని ఒప్పుకొనెదను. మనతగాదాలలో మూడవపార్టీ జోక్యముమాత్రముకూడదు. అది మనఅశక్తతను, అజ్ఞానమును సూచించును.

ఆజా—అవును. మూడవపార్టీ మధ్యవర్తిత్వ మున్నచో మనబ్రతుకు పిల్లులు, కోతి రొట్టెముక్క కథమాదిరిగా చివరకుపరిణమించును.

జిన్నా—నిజమే! తమరు కాంగ్రెసుముస్లిము లగుటవల్ల వారిపాటమే ఇచ్చట ఒప్పజెప్పుచున్నారు. మన హక్కులిచ్చుటకు యీ కాంగ్రెసు వారెవరు? బ్రిటిషువారు మనకును వారికిని పాలకులు. వారినే అడిగెదముగాక.

నెహ్రూ—మేమే అధికారుల మని చెప్పుటలేదు. మనము సోదరులము. గృహకల్లోలములను మనలోమనము సరిదిద్దుకొనవలెను. పరాయి వారిని బతిమలాడుట తగదు.

జిన్నా—బ్రిటిషు వారి రక్షణయందే మాకు నమ్మకముకలదు.

నెహ్రూ—డియర్ మిస్టర్ జిన్నా! ఒకప్పుడు నీవును కాంగ్రెసుఅధ్యక్షుడవు. హోంరూల్ లీగులో సభ్యుడవు. మతభేదములు పాటింపక దేశపారతంత్ర్యమును పారద్రోలుటకై దేశీయ ఉపన్యాస పీఠము లందు వ్యక్తృత్వమును ప్రవహింపజేసినావు. కాంగ్రెసువాదివిగా

నుండి అసంఖ్యాక ప్రకటనలు చేసినావు నీవెనుకటిచరిత్ర జ్ఞప్తికి తెచ్చుకొనుము. "ఊసరవిల్లి" వలె వెంట వెంటనే అకారణముగా అభిప్రాయములు రంగులు మార్చుకొనుట కూడదు.

జిన్నా—అప్పుడు కాంగ్రెస్ జాతీయసంస్థ. నేడు హిందూమతసంస్థ.

నెహ్రూ—కాంగ్రెస్ సర్వమతప్రాతినిధ్యముగల సంస్థ. దీని జనకుడు ఆంగ్లేయుడు. ప్రథమమున అభివృద్ధికారకుడు పార్సీ. పిమ్మట అన్నిమతముల, కులములవారిందుచేరి యేభేదములు పాటింపక యీ సంస్థను వృద్ధిచేసిరి. ఇది ప్రజలసొత్తు. ప్రజలసంస్థ.

జిన్నా—జవహర్! నన్ను మోమోటపెట్టకుము. నా నిశ్చయము మరల్చుకొనజాలను.

నెహ్రూ—మిత్రమా! జిన్నా! నాస్వార్థముకొరకు నే నేమియు యాచించుటలేదు. దేశోన్నతిని కోరి యిట్లు దీనుడనై వేడుచుంటిని. నీయంతవిజ్ఞాని పరాయిప్రభుత్వపు వలలో చిక్కి స్వల్పమైన హక్కులకొరకై విదేశీయులను యాచించుట తగునా! నీవు యాచించినను వారు దేశమునూ నీకుగాని, నీమతమువారికిగాని కట్టబెట్టరు. అట్లు వారు చేయుటకు అశక్తులు. కడపటిమాట యేమనగా వారును, నీవును ఏకమైనను ఈ దేశమును చిరకాల దాస్యబంధములలో నుంచజాలరు. నేడు భారతప్రజానీకము చైతన్యవంతమైనది. వారిలో విప్లవజ్యోతి వెలుగుచున్నది. క్రొత్తప్రపంచపు వెలుగు బాటలు కన్పించుచున్నవి. అట్టిచో నెవ్వరును, ఏ మతస్థులును, ఏ దేశీయులును భారతజాతి నేటి నవ్యచైతన్యమును, అభివృద్ధి మార్గమును, స్వాతంత్ర్యపిపాసను అరికట్టజాలరు. మూర్ఖులై అడ్డువచ్చినను ప్రజాశక్తికి లొంగిపోయి సర్వనాశన మగుదురు. కాన, బ్రిటిషువారిపై మోహాముమను విడనాడుము.

(మోహన)

మానుము వారియాశ, ఇటు మక్కువచూపుము మాటకైన; నీ
కేమియు వారు త్రవ్వి తలకెత్తరు దేశము నేడు నీవయిన్

కాననికండ్లు పెట్టుకొని కాచుకయున్నదిగాన—ఓయి! జి
న్నా! నిను వేడుకొందు వినయమ్ముగ స్వార్థము త్రోసివుచ్చుమా!

జిన్నా—బ్రిటిషువారి మాటమరచెదను. వారి సహాయమును కోరను. మీ కాంగ్రెసువారు ముస్లిం లీగువారితో కలసి సంయుక్తమంత్రి వర్గములు నిర్మించెదరా! మా "లీగు" ను గుర్తించెదరా? ప్రత్యేక నియోజకవర్గము లంగీకరించెదరా? మనరాజీకి ఈఅంశ ములే ప్రాతిపదికలుగా అంగీకరింపగోరెద.

నెహ్రూ—మీ అభీష్టము నెరవేర్చుటకై ప్రత్యేక నియోజకవర్గము లంగీకరించెదము కాని మంత్రిపదవులు తిరిగి చేపట్టము. బ్రిటిషు ప్రభుత్వమువారి యుద్ధాశయములు మనలను చిరకాల దాస్య కూపమున త్రోయుటకు ఉద్దేశింపబడినందున కాంగ్రెసువారు స్వాతంత్ర్యసమరమును సాగింపబోవుచున్నారు. సంపూర్ణ స్వాతంత్ర్యలబ్ధియైనపిమ్మట మన పాలిభాగములు వంతులు సరి దిద్దుకొనగలము. ఈ శాంతిసమరములో మీ లీగు సాయపడ వలెనని కోరుచున్నాను.

జిన్నా—అట్లైన మాలీగును సమావేశపరచి కార్యనిర్వాహకవర్గము వారితో ఆలోచించి అచిరకాలములో తమకు కబురుచేసెదను.

ఆజా—"ఆలోచించి కబురుచేయుట" యన నేడు కాదనుటయే. ఏల యీ ఆలోచనలు! నీవే కాంగ్రెసులో చేరి దేశమును నడుపుము. నిన్ను కాదనువారెవరు? నీయంతవానిని ఒకరు ప్రబోధింపనేల? మనమిత్రుడగు జవ్హారు యాచించు స్వభావముగలవాడుకాదు, నీకంటె మిన్నయైన "గీర్వాణము" కలవాడు.

(కేదారగౌళ)

ఎన్నడువేడుటల్ మదిని నెంచని జవ్హారువచ్చి నేడు ప్ర
చ్ఛన్నముఖాబ్జలోలుడయి సాచినచేతుల దేశదాస్యవి
చ్ఛిన్నముకోసమై మనల స్నేహగతిన్ బతిమాలుచుండగా
మిన్నును చూచెదేల? ఇది మేలొనగూర్చునటోయి మిత్రమా!

జిన్నా—నన్నొకరు ప్రబోధింప నక్కరలేదు. బుజ్జగింప నక్కరలేదు. నా కర్తవ్యమును నే నెరుంగుదును. స్నేహపూర్వకమైన జాబుల ద్వారా జవ్హారుతో సంప్రదింపులు జరిపెదను.

అజా—తప్పించుకొను మాటలుగాక దీర్ఘముగా యోచింపుము. నేడు దేశమోక్షము నీ "అవును కాదు"లపై ఆధారపడియున్నది.

జిన్నా—తప్పక మా కార్యాచరణసంఘముతో ఆలోచించి మీకు కబురు చేసెదను.

నెహ్రూ—ఇక సెలవు. మీ అనుకూలప్రత్యుత్తరమునకై వేచియుందును.

జిన్నా—అల్లే! కానిండు. సెలవు.

అజా—భాయీ! బిదా లేతాహూ. హమారే ముల్క్‌కో మత్ భూల్నా.

జిన్నా—మైభీ; హమారే మజ్‌హబ్‌కో మత్ భూల్నా.

(తెరపడును)



## 2వ రంగం

స్థలము—సైగాన్‌లో గాంధీజీ కుటీరము

సమయం—సాయంత్రం 3 గంటలు

ప్రవేశం—గాంధీజీ - పటేలు - నెహ్రూ - రాజేంద్రుడు - సరోజినీదేవి.

పటే—మహాత్మాజీ! ఇకనైనను బ్రిటిషువారిపై ఆశలువదలుకొనరాదా?

గాంధి—నేను ఆశావాదిని. ఎవ్వరిపైనను ఆశ వదలుకొనజాలను. ప్రపంచప్రజలు మనసమానమును, న్యాయమును గుర్తింపవలెను.

సరో—అట్లైన మనస్వాతంత్ర్యసన్నాహములు బోసుగారు చెప్పినట్లు వట్టి బెదరింపులేనా?

గాంధి—కాదు, కాదు. తప్పక సమరసన్నాహము చేసెదము. కాని, తుదివరకు రాజీపద్ధతులను విడనాడము.

అజా—ఇదెట్లుపొసగును. సమరము—సన్నాహము. పరస్పరవిరుద్ధములు కావా?

స్వరాజ్—దేశమున కిప్పుడు రెండే మార్గములుకలవు. సమాధానము; లేక సంఘర్షణ. గమ్యస్థానముచేరుటకు ఏదోయొక మార్గమున పోవలెనుగాని రెండుగుఱ్ఱములమీద ఒకేసారి ఎట్లు స్వారి చేయగలము?

పటే—సమాధానమార్గము విఫలమైనది. ప్రజాపరిషత్తు విషయము పూజ్యమైనది. ఇక సంఘర్షణమార్గమే మిగిలియున్నది. స్వరాజ్య మహాప్రస్థానము నిక సాగింపవలెను.

రాజేం—నిజమే! కాని, మనము మహాత్మునియందేగాక ఆయన కార్య క్రమాచరణపటిమయందుకూడ అంధవిశ్వాసులమై మెలగ వలెను. ఎవ రేమన్నను మనము లెక్కచేయరాదు.

గాంధి—మీవంటి శాంతిసమరయోధులకు విధేయత, క్రమశిక్షణ క్రొత్తగా నేర్పవలసిన పనిలేదు. అభిప్రాయభేదములు వెల్లడింప వచ్చును. అంతమాత్రమున బద్ధవిరోధులలో లెక్కింపకూడదు. ప్రస్తుతకర్తవ్యము ఎద్దియన—తీవ్రమైన అహింసా సమరసన్నాహములుచేయుచు రాజీకవాటములుకూడ తెరచియుంచవలెను.

సరో—ఇక మనము స్వాతంత్ర్యసమరముయొక్క సరిహద్దులందు పూనికతో నిలచినట్లేకదా!

పటే—అవును. రణప్రారంభముకూడ చేసినట్లే.

గాంధి—కయ్యమునకు కాలుదువ్వుట మన ఆశయముకాదు. సులభ ముగా సమన్వయమార్గము కనిపించినచో సమరము ఆపివేయ బడును.

రాజేం—ఇక మనకర్తవ్యమును సూచింపుడు.

గాంధి—నేటి స్వరాజ్యసంరంభమునకు దేశీయులను సిద్ధపరచుడు. శాంతి సైనికులను ప్రోగుచేయుడు. సత్యాగ్రహశిబిరములను నిర్మింపుడు. సైనికులకు సమరశిక్షణ గరపుడు.

వశే—సైనికుల తరిబీతు పూర్వమువలెనే యుండునుకదా.

గాంధి—అవును. శాంతిసైనికులు చక్కని శీలనంపద కలవారుగను, నిర్మాణ కార్యక్రమమునందు మిక్కిలి శ్రద్ధకలవారుగను ఉండవలెను. మానవసేవయే ఈశ్వరసేవగా నెంచవలెను. ఆత్మబలము కలిగియుండవలెను. ప్రతీకారవాంఛ లేక బాధలను అనుభవింపవలెను. ఇది ముఖ్యము. ఇంకను – సత్యాగ్రహ లక్షణము లేవి యన:—

(బి ల్హా రి)

కలనైన దౌర్జన్యకాంక్షను తలపక శాంతిమంత్రజపంబు సలుపవలయు
తులలేనిసౌఖ్యాల తులదూగుటలుమాని కష్టసహిష్ణుత గాంచవలయు
హింసావిధానంబు హేయంబుగానెంచి మేటియహింసతో మెలగవలయు
కంఠమ్ముపై కత్తి కారాడునప్పుడైన నిలచి సత్యమ్మునే పలుకవలయు
ధైర్యసాహస దీప్తితో తనరవలయు
నిలువుమనుచోట "అంధుడై" నిలువవలయు
కదురుపైతీయు కద్దరే కట్టవలయు
శాంతిసైనికవిధు లివ్వి సమరమందు.

నెహ్రూ—హింసాసమరములు సాగించు విదేశములందు ఇట్టి శాంతి యోధులు దొరకుట దుర్లభము. బుద్ధభగవానుని పవిత్రబోధామృత ధారాసించితమైన మన భారతభూమియం దిట్టి యోధుల కొరవలేదు. కాంగ్రెసువారు—

(మో హ న)

మున్ను సాగించిన మొదటియుద్ధమునందు పిలువగా వందలు పలికినారు
శాసనోల్లంఘనసమయమ్మునందున "కూ" యన్న వేలకు కూడినారు
ఉప్పుసత్యాగ్రహ మొనరించుతరుణాన "ఊ" యన్నపదివేలు ఉబికినారు
మధ్యమధ్యయొనర్చు మరికొన్నిసమరాల పిలువక లక్షలు పెరిగినారు
సైనికులలోటు లేదింక సమరమందు
కోట్లకొలదిగ సైన్యమ్ము కూర్చగలము

ధనసహాయము మెండుగా తనరగలదు
కాని, సర్దార్లు దొరకుటే కష్ట మిపుడు.

అజా—జవహర్ చెప్పినట్లు ప్రయత్నించిన శాంతిసైనికులు దొరక వచ్చును గాని సేనానులవిషయమే గడ్డుసమస్యయగును.

పటే—అట్లుకాదు. సైనికులదే చిక్కుగాని సేనానులు మిక్కిలికలరు.

(మాండ్)

సరిహద్దురాష్ట్రానసమరయోధుండైన "అబ్దుల్ గఫ్ఫార్ ఖాన్" అలరియుండె
ఆంధ్రదేశంబున అతిరథశ్రేష్ఠులు "రంగా ప్రకాశముల్" రాణమీరె
సంయుక్తరాష్ట్రింపు స్వాతంత్ర్యవీరుండు పండిత "జవ్వారే" యుండెనిచట
బీహారుప్రాంతంపు భీష్మసదృశవీర "రాజేంద్రు" డిచట నలంకరించె
కార్మికజనాప్తుడు "జయప్రకాశు" డుండె
మేటి "రాజాజి, పట్టాభి" వంటిఘనులు
కలరు యోధానుయోధులు పలువురింక
నడుపగలరయ్య సమరమ్ము దుడుకులేక.

వరో—బార్డోలీరాజకోట సమరనిర్వాహకుడైన అసలు "సర్దారు" కలడు. కావున మన మీ శాంతిసమరము జయప్రదముగా కొన సాగింతుము.

రాజేం—నిజముగా యీసర్దారులేని మన స్వాతంత్ర్యసమరము జయోన్నతిని పొందజాలదు. సత్యాగ్రహసమరనిర్వహణమునందు వారికిగలయనుభవము మహాత్మునికిగూడ లేదన్న అతిశయోక్తి కాదు.

గాంధి—సత్యము నాదరించుట సత్యాగ్రహిలక్షణము. కాన, రాజేంద్రుని ఊహానుసమర్థించెదను. మీమీ రాష్ట్రములందు శాంతి సమరసన్నాహయత్నములు సలుపుడు. అసంఖ్యాకులైన ప్రచార బృందమును నియమించి వారు జట్లు జట్లుగా వెళ్ళి గ్రామప్రజా

సీతమునకు ప్రబోధమొనర్చునట్లు త్వరితగతిని యేర్పాట్లు చేయుడు. సర్దారుల సలహాలను గమనింపుడు.

రాజేం—అట్లైన మనమందరము నేడే యీ పరమపవిత్రమైన "స్వాతంత్ర్య పర్వదినము" నందు ప్రథమ సైనికులముగా చేరుదము.

గాంధి—మీసలహా ఉత్తమమైనది. వెంటనే "త్రివర్ణపతాకమును, రక్షాబంధనములు" మున్నగు పవిత్రసామగ్రిని తెప్పింపుడు.

(రాజేంద్రప్రసాదుఅజ్ఞవలన ఒక కాంగ్రెసువాలంటీరు పైచెప్పినసామగ్రి తెచ్చియిచ్చును)

గాంధి—సోదరీ! సరోజినీ! ఈ శాంతిసైనికుల ఫాలభాగములు తిలకాంకితములుగా శోభిల్లుటకు శుభచిహ్నముగా వారికి తిలకమందిమ్ము. అజాద్‌గారికిమాత్రము వద్దుసుమా!

అజా—నేనుగూడ శుభచిహ్నమును ప్రేమించెదను కాని, తిలకమును మాత్రము మతచిహ్నముగా అంగీకరింపను. దేశాభిమానికి మతము అడ్డుతగులరాదు: అసలు వీరయోధునకు, సమరసైనికునకు మతము అనుబంధము తగదు. దేశమాతను సేవించుటే సైనికుని మతము. రణమున వెన్నుచూపకుండుటే వానిమతము.

సరో—కాంగ్రెసువారికి మతసహనముకలదని సూచించుటకే మహాత్ము డిట్లు వచించెను. ఎవరి మతసాంప్రదాయములు వారు మన్నించుట శ్రేయము. అది వ్యక్తియొక్క స్వేచ్ఛకు • వదలవలెను. నిర్బంధము కూడదు.

(సరోజినీ అజాద్‌గారికి తప్ప మిగతావారికి తిలకము నందించును. అందరికిని "వీర గంధము" అందించును. గాంధిగారు సరోజినీదేవికి వీరగంధము, "రక్తతిలకము" అందించును.)

గాంధి—అజాద్‌గారు సరోజినీదేవిగారికి తప్ప మిగిలినవారికి "దీక్షాకంకణములు" కట్టవలెను.

ఆజాద్‌గారు ఆశ్లేషచేయుదురు. గాంధిగారు ఆజాద్‌గారికి రక్షాబంధము కట్టెదరు. తక్కినవారు స్వయముగా దీక్షాకంకణము కట్టుకొనుదురు.)

గాంధి—ఈ దీక్షాకంకణముయొక్క ఉద్దేశము:—"నేటినుండి నేను భారత దేశస్వాతంత్ర్యమునకై దీక్షపూనితిని. సమరము ముగియువరకు నేను సర్వసౌఖ్యములు వర్జించెదను. దేశసేవయందు నా ప్రాణములు, ధనము, మనసు అర్పించుటకు వెనుదీయను" అని మాత్రము. ఇక స్వాతంత్ర్యప్రతిజ్ఞ తెల్పెదను. మీరందరు నాతో ఉచ్చరింపుడు.

(గాంధిగారు చెప్పినట్లు అందరు స్వాతంత్ర్యప్రతిజ్ఞ పలుకుదురు).

## స్వాతంత్ర్య ప్రతిజ్ఞ

"ఇండియాలో బ్రిటిషుప్రభుత్వమువారి పాలనవలన సమస్త భారతీయుల స్వాతంత్ర్యము తొలగినది. భారతీయుల సంపద, విజ్ఞానము, విద్య, నాగరకత నశించినవి. శౌర్యము నష్టమయినది. పరాధీనత హెచ్చుపెరిగినది. భారతీయులు, ఆర్థికముగా, నైతికముగా, సాంఘికముగా, రాజకీయముగా పరాయి ప్రభుత్వ పరిపాలనలో అణచిపెట్టబడి సమస్తశక్తులు కోల్పోయిరి. తిరిగి భారతీయులకు పైచెప్పిన శక్తులు సమకూడుటకు సంపూర్ణస్వాతంత్ర్యము అవసరము. ఇట్టి సంపూర్ణ స్వాతంత్ర్యమును శాంతి, సత్య, అహింస పద్ధతులద్వారా స్వశక్తితో నా భారతదేశమునకు సంపాదించుటకై యీనాడు నేను ప్రతిజ్ఞ చేయుచున్నాను. స్వాతంత్ర్య సాధనలో నా 'సర్వస్వము'ను దేశమునకు అర్పించుటకై ప్రతిజ్ఞచేయుచున్నాను."

# త్రివర్ణపతాక వందనము

(గాంధిగారు త్రివర్ణపతాకమును ప్రతిష్ఠించెదరు. నాయకులందరు వరుసగా పతాకవందనము సల్పుదురు. ప్రథమమున గాంధిగారు పతాకవందనము చేసెదరు. పతాకమునుగూర్చిన కీర్తనలను చదివెదరు)

గాంధి—స్వతంత్రభారత్ కీ జై.

(అందరు అట్లే అనెదరు. పిమ్మట రశీదుపుస్తకములలో సంతకములొనర్చి సైనికులుగా చేరెదరు.)

ఆజా—నేటినుండి మనమందరము స్వాతంత్ర్యసమర సైనికులమైతిమి. ఇక స్వతంత్రభారతపౌరులము కావలెను. అట్టి శుభదినమునకై మనమందరము కృషిచేయుచు వేచియుండవలెను.

గాంధి—రాష్ట్రపతీ! శాంతిసమర సైనికులను చేర్చుకొనునప్పుడు ప్రచారకులు యీ "ప్రబోధకరపత్రిక" ప్రతులను ప్రజలకు పంచిపెట్టునట్లు ఏర్పాటుచేయుము. ఇక మనము శాంతిసమర సన్నాహ కార్యక్రమమున నిమగ్నులమై యుండెదముగాక. "వ్యక్తిసత్యాగ్రహమును గూర్చి మున్ముందు ఆలోచించెదము.

కాకేం—చిత్తము.

(గాంధిగారు ఇచ్చిన ఆ కరపత్రమును తీసికొని కాంగ్రెసువాలంటీరు చేతికిచ్చి చదువుమని ఆజ్ఞాపించును.) (వాలంటీరు ఇట్లు చదువును)

(ప్రబోధ కరపత్రము)

కాం. వా—భారత ప్రజలారా! మన భారతమాత దాస్యవిముక్తికై మనము స్వాతంత్ర్య సమరమును సాగింపబోవుచున్నాము. మీ శక్తికొలది అన్నివిధముల మీ దేశమునకు సాయముచేయుడు. మత, కుల, వర్గ, వర్ణములయొక్క విభేదములను పాటింపక శాంతిసమరమునకు సంసిద్ధులుగా నుండుడు. స్వాతంత్ర్యదీక్ష పూనుడు. సత్యాగ్రహ సైనికులుగా వేలకొలది చేరి దేశమును స్వాతంత్ర్యపథమున అగ్రగామిగా నిలబెట్టుడు. నిర్మాణకార్యక్రమము క్రమముతప్పక ఆచరింపుడు. భారతదేశం అచిరకాలంలో

సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించి ప్రపంచ దేశాలలో శిరోమాణిక్యమై వెలయుగాక! రాట్నలక్ష్మిని పూజింపుడు. కదురు కవ్వము లాడినచోట కరవు చొరనేరదు. కాన—

(కేదారగౌళ)

కదురుతో వడకండి కద్దరుకట్టండి కూడుగుడ్డలుమీకు కూడునండి
శాంతిగా చరియించి సత్యమేపలకండి హెచ్చుగా కీర్తిని తెచ్చుకొనుడు
హిందువుల్ ముస్లిముల్ ఏకమైయుండండి నిజమైన మతమును నేర్చుకొనుడు
శాంతిసమరమునందు చప్పునచేరండి రైతు, కూలీలదే రాజ్యమండి.

చేతివృత్తుల నభివృద్ధి చేసికొనుడు
దయను చూపండి మాలల తరుమకండి
దేశమోక్షంబు సాధించి తెచ్చికొనుడు
దేశమాతకు జోహార్లు తెలుపుకొనుడు

స్వతంత్రభారత్ కీ జై.
సామ్రాజ్యతత్వము నశించుగాక!
విప్లవము వర్ధిల్లుగాక!
ఇన్‌క్విలాబ్ జిందాబాద్.
జై భరత్ మాతాకీ జై.
జై హింద్. వందేమాతరం

(తెరపడును.)

(సమాప్తి)



ఆంధ్రరత్న గ్రంథమాల — పేరాల.

# నియమములు

(1) ఈ గ్రంథమాలయందు దేశోన్నతికి పనికివచ్చు సారస్వతగ్రంథములు సంవత్సరమునకు నాలుగుమాత్రము ప్రకటింపబడును.

(2) పోషకులు, రాజపోషకులు, మహారాజపోషకులు ఈ గ్రంథమాలకు అవసరములేదు. సామాన్యులైన చందాదారుల అభిమానము చాలును.

(3) కేవలం చందాదారులు మాత్రమే సంవత్సరమునకు రు 5/– లు ముందుగా కట్టి ఇందు చేరవలెను. తపాలాభృతి చందాదారులే భరించవలెను.

(4) ఇందు వెలువరింపబడు గ్రంథములు ప్రజానీకమునకు అందుబాటులో నుండు భాషలోనే యుండును.

(5) నాటకాలు, నవలలు, కథలు చరిత్రలు ఇంకా యితరపోకడలుగల సారస్వతగ్రంథములు ఇందు వీలునుబట్టి తప్పక ప్రకటింపబడును. ప్రకటించిన వారంరోజులలోపుగా చందాదారులకు ప్రతులు పంపబడును.

(6) ఈ గ్రంథమాలకు ఇద్దరు సంపాదకులు కలరు. వారు పుస్తక ప్రచురణకు బాధ్యత వహించెదరు. 1. చుండీ రామమూర్తి, 2. అబ్బరాజు రంగారావు.

ఇట్లు,

కార్యాచరణ సంపాదకుడు.

అబ్బరాజు రంగారావు,

భావనా ఋషి పేట.

పేరాల, (వయా) చీరాల.

ఈ పుస్తకం వలయువారు :

అబ్బరాజు రంగారావు

సంపాదకులు

'ఆంధ్రరత్న గ్రంథమాల'

భావనాఋషిపేట, 1వ లేన్

పేరాల

(వయా) చీరాల.

అని

వ్రాయండి.